# అంకితము

ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వ

ఉప ముఖ్యమంత్రి

## శ్రీ నీలం సంజీవరెడ్డి గారికి.

చాలకళ లూరు జాతి వజ్రాలు మొలవఁ
జాలు రాయలసీమ రత్నాలసీమ
నిగనిగని నిగ్గులందేలు నీలముగని
ప్రభవ మయ్యెను సంజీవరత్న మొకఁడు. 1.

జననభూమికిఁ గళదెచ్చు తెనుఁగు బిడ్డ
సీమ నలరించు రాయలసీమ బిడ్డ
ప్రజల సేవేళఁ బోషించు రైతుబిడ్డ
దొడ్డ గొనముస గడిదేలు రెడ్డిబిడ్డ. 2.

పెల్లూరు సిరుల సంపద
నెల్లూరై వెలయు నిపుడదే నామంబా
నెల్లూరఁ జినపరెడ్డికి
నిల్లాలౌ సుబ్బమాంబ కితఁడు సుతుండౌ. 3.

భారతంపు ప్రబంధ పరమేశ్వరుని భవ్య
వాణీవిలాసాలఁ బాడుకొలిపి,
కవిసార్వభౌము శృంగార వాగ్గుంభనం
బునఁ గనకాభిషేచన మొనర్చి,
బాలసరస్వతి భాషిత సుమముల
సౌరభామోదంబు సంగ్రహించి,
విశ్వవిద్యాకళా వితత కవిత్వత
త్త్వవిచార సఫల భాసంబుగాఁగ

తరతరంబులఁ దెన్గుక్షేత్రములయందు
నించురసములఁ గవిత పండించుకొనెడి
సంప్రదాయపు రెడ్డి వంశంబునందు
బుట్టి పూర్వుల త్రోవనే మెట్టినాఁడు.

తన పల్కుబడి భారతంపు పెద్దల యా
శయరహస్యార్థ భాష్యమ్ముగాఁగ
తన తెల్వితేటలు తెనుఁగుతల్లినవఁత
తప్పింపఁ జాలు నోదార్పు గాఁగ
తన యుక్తిచాతురీఘనత వితండ వా
దోపవాదంబులత్రోపుగాఁగ
తన తర్కవాదంబు తత్త్వార్థ సమున్మథ
జన వివేక ప్రయోజనముగాఁగ

ఘన వివేచనా నైపుణి పెనఁగునడిన
ముడిసమస్యల చిక్కుల విడుపుగాఁగ
తెలుపగల రాజకీయ సాహిత్యపరుఁడు
ఘనుఁడు బ్రిటిషు సాహిత్య పోషణంబు. 5.

వయసున చిన్నవయ్యుఁ బ్రతిభామతి వృద్ధులఁ దీర్పజాలి, య
ధ్యయనమును పెద్దలైన గుణదక్షత దేశహితైక దీక్షితా
శ్రయనధురీణతన్ అవితథ ప్రభవంబుగ నాంధ్రరాష్ట్రమున్
నయగుణ పద్ధతిన్ నడపునాయక రత్నమవైతి నేటికిన్. 6.

ఘనుగుం దేశసమస్య లన్నె పనిపూండెన్ దిద్దగాఁ దీర్పఁగాఁ
దెనుగుం బాసకు నల్లి పెక్కు గలుగున్ దిద్దంగఁ దీర్పంగ, యో
జన మన్ పేరిటి ప్రగ్రహంపు ప్రభుతాసారథ్యమున్ బూను మీ
కు సమత్వం బదివశ్యమైన దెచుమీ గుప్పింటిలో ముత్యమై. 7.

ఘనసీమఁడవని, పాలింపగఁ
బసగల వాఁడవని, గౌరవము ననురాగం
బెసలారఁగ నీకావ్యం
బసదృశముగ నీదుపేర నంకిత మిత్తున్. 8.

పేరిమిగల్గు పెద్దలకుఁ బెద్దయుఁ దృప్తిని గూర్చునంతటన్
సారములేని నేరమి గణింపక సత్కవితాదరంబుతో
నోరిమిఁ జిన్నికానుక సచివోత్తమ! ప్రీతిఁబరిగ్రహింపుఁడీ
కూరిమితో నొసంగునది కొంచెము గొప్పయటంచు నెంతురే? 9.

కృతివి ప్రజాహిత దీక్షఁ
బతివి ప్రభుత్వంపుఁ గార్యభారము పూన్కిఁ
కృతివి పతివి నైయుండియు
కృతిపతివి సమస్త మైతి 'కృతిపతిఁ' గొనుచుఁ. 10.

శాలివాహనశకము మానదయసంఖ్య
గలుగు విజయసంవత్సర కార్తికసిత
పంచమీ సౌమ్యవార మర్పణము జరిగెఁ
బతికి సంజీవరెడ్డికి 'కృతిపతి' కృతి. 11.

కృతిఁ సరాగంబున గేలఁగైకొ
నితోధిక శ్రీలు వరించుగాతఁ
పతుల్ కృతుల్ దైవకృపార్ద్రదృష్టిఁ
సతంబు ప్రాపింతురు సౌఖ్యరాశిఁ. 12.

తా డి ప త్రి.
11-11-53

జోస్యము జనార్దనశాస్త్రి,
గ్రంథకర్త.

# పీఠిక

శ్రీ జోస్యము జనార్దనశాస్త్రిగారు ఈ చిన్నిగ్రంథములో రెండు కావ్యములు ప్రకటించినారు. మొదటిదానిపేరు కృతిపతి, రెండవది సీతమ్మ. ఈ కృతిపతి గువ్వల చెన్నడికథ. ఈ కథను వీరు చాల చమత్కారముగా వ్రాసినారు. చెన్నడు, చెన్నడి భార్య జానపదభాషలో మాట్లాడుతారు. ఆ భాషంతా వృత్తాల్లో పెట్టారు. ఆ వృత్తాలన్నీ చాలఅందముగా నున్నవి. కొన్నికొన్ని పద్యాలు మచ్చుముక్కలవలె నున్నవి.

క॥ తనపేరెన్నాళ్లైతే।
జనులనుకొంటారో యిలలో? నచ్చిన పున్యా।
త్ముని కన్నాల్లే సొర్గము।
అనుబవమంటారు పెద్దఅయ్యోర్లంతా॥

ఈ రీతిగా ఈ జానపద భాషలో వ్రాసిన పద్యాలన్నీ చాలా సొగసుగనున్నవి. ఈయన మంచి కవితాశక్తిగలవాడు. పెద్దన్నగారు, ఆయన భార్యయు మాటాడుచుండగా తెల్లవారి కోళ్లు కూసినవి. "తామ్రచూడంబు లేమిటనైనఁ మృదులాత్మ సాటిగలరే మీ కొక్కొ రొకొక్కొయనెఁ" బుద్ధచరిత్రములో తిరుపతి వేంకటేశ్వరులు

"ఇవి రాజసుతులు చేయవలసిన పనులు
కావుకా వనుచు కాకమ్ము లరచె" అన్నారు.

ఈ "కావుకావు"ను జాషువాకవికూడ ఒకచోట నిట్లే చమత్కరించెను. ఈకవి 'కొక్కొరొకొక్కొ' అనుదాని నిట్లు చమ

త్కరించెను. ఈయన మంచి భావనాచతురుఁడు.
“ఎన్నిదినాలువేసితివి? ఎంత వెలైనది? నీ ఋణమ్ములో నన్నిరికిం చుకొంటివి కనంబడరాక పెనంగు కట్లతో” ఇవి పెద్దన్నగారు చెన్నడితో నన్నమాటలు. ఈచివరి చరణములోని యర్థము మంచి భావుకతకలిగినది.

“మబ్బు తునకల యేనుగంబారిపైన ।
నరుగుచుఁ గృష్ణరాయల ననుకరింప ।
ఎదురుపడిన చకోర కవీంద్రు లలర ।
నిలిపి కేలూత యొసఁగుట నేర్పుగానియె”

ఈ రీతిగా ప్రసక్తమైన వర్ణన కథాగతాంశములతో కలిపి చేయుట ఒక నేర్పు.

“యశో యజ్ఞస్యకు-ఏతత్సామగాయ మనదు” అనెడు వైదికుల పరిభాష యొకటి యిచట నున్నది. “యశోయజ్ఞస్య దక్షిణా” “ఏతత్సామగా య న్నాస్తే” అన్న వేదపంక్తులలోని చివరి రెండు మాటల కొకదాని కొకటి సమాధానముగా ఇట్లు లోకములో వైదికులు మాట్లాడుకొందురు. దక్షిణ ఏమిచ్చి రనగా నాస్తి అని చెప్పినారని దీనియర్థము. ఇటువంటివి తత్తత్పాత్ర పోషణమున కనుకూలముగానే యుండును.

“నన్నెవ్వరూ, మెయ్యఁగ బొమ్మనలేదు” “ఐనది కదపు నహో సన్మానము” ఇటువంటి శబ్దము లీకవి యథేచ్ఛగా వాడును. ఈ కావ్యములోని చివరిపద్యము.
“ఇవి మెల్లగాజు పెంకులె। యవునవి యినరశ్మిసోకినంతన వెల్గుఁ

భవదీయౌదార్యమునకు । సన తేది విశుద్ధకీర్తి సాంద్ర నరేంద్రా!

ఈ పద్యము సరిగా పూర్వకవుల చాటువుల వరుసలో కుదిరినది.

ఈ కృతిపతి యన్న కావ్యము చమత్కారముగా నున్నది. ఈ కవియొక్క శైలియే యొక విలక్షణతకలది. మెత్తగా సుకుమారముగా లోకోక్తులు, నానుడులు ప్రాచుర్యముగా నుండునట్లుగా, అన్వయకాఠిన్యము లేకుండ అదియొక యొయ్యారముగా నడచున ట్లుండును. ఇందులో మనుచరిత్రములోనివి నాటి చాటువుల లోనివి చరణములు కొన్ని స్వపద్యములలో భాగములుగా చేయబడినవి. ఆ చేసిన యెదుకు లతుకులుగా లేవు. గ్రంథమంతయు నొక వెన్నముద్దవలె నున్నది.

రెండవ కావ్యము సీతమ్మ. ఈ కావ్యములో 231 పద్యములున్నవి. ఇందులో కథ లేదు. సీతమ్మ యని పేరుపెట్టుట మాత్రము గడుసుగా నున్నది. ఈ కాలములో సీతమ్మ యనుపేరుగల యొక స్త్రీ తన యొక్కయు, తనతోడి స్త్రీలయొక్కయు, దుర్దశను పురుషులయొక్క యథనుకామప్రవృత్తిని శ్రీరామచంద్రుని భార్యయై, లోకమాతయై, మహాపతివ్రతా చూడామణియై భారతజాతి స్త్రీజగత్తునకు మచ్చుముక్కయైన సీతాదేవితో మొఱపెట్టుకొనుట. కృతిపతియన్న కావ్యములో ఈ కవిగారి యేశైలి పుష్పించినదో యీ కావ్యమునందది ఫలించినది. ఈ కావ్యములోని మొదటి వందపద్యములు వాని శైలియదే. ఆమాట లే వేరు. లోకములో మనము నిత్యము వాడుకొను పలుకుబళ్లన్నియు గణయతిప్రాస

బద్ధములై యుండుటయే. ఆ మాటలనన్నింటిని అల్లుకొనుటలో యతిప్రాసల సమకూర్చుటలో కవికొక చమత్కారమైన నేర్పు కావలయును. ఆ నేర్పు పద్యములయందు సమృద్ధిగా నున్నది. మహాకవితా లక్షణములు కొద్దికొద్దిగా పుస్తకము తళతళలాడుటకు కవి యుపయోగించుచుండును. "నిరాఘాటముగా సుఖాల పిసుకం గలిగెన్" ఇటువంటి ధ్వనిశబ్దము లుండును. పొరక దెబ్బలు మొదలైన ప్రాంతీయములు, 'అహల్యాయైజార' మొదలైన వేదములోని మాటలు, క్లిష్టప్రాసలు చేయికి చెయ్యి అను గడుసు వ్యాకరణములు రకరకాలైన శబ్దసామగ్రితో ఈకవి ఈకావ్యమును చమత్కారముగా వ్రాసెను.

ఈయన చక్కటి పండితుడు. కాని బుద్ధిపూర్వకముగా అవ్యాకృతరూపములను వాడును. 'పృష్టే. వేరు' కూతురిని–మహా నిప్పు–వీభూతి–కూర్చొవలె–యిట్టి అవ్యాకృతరూపములను వాడును. కాని ఆ వాడినచోట నేదోఒక విలక్షణమైన సొగసు రాలేదనుటకు వీలులేదు. 'పరమ్మ పిల్లలు' లోకములో వాడుచున్నారు. అట్లు వాడిననే ఆ విలక్షణార్థచ్ఛాయ పుట్టునని యనుకొనువారుండవచ్చును. అది కాదనుటకు వీలునులేదు.

'సీతమ్మ' యనుపేరుపెట్టి యింతకావ్యము వ్రాయుట మాత్రము ఒక విలక్షణమైన శక్తి యనకుండుటకు వీలులేదు. ఏమియు లేనిచోట ఏదో ఏదో పెంచి వ్రాయుటకు నొకపట్టుదల యు, దానిని పట్టుకొని సాగదీయుటకు కావలసిన మానసిక శాబ్దిక శక్తియు కావలెను అవి ఈకవిదగ్గర నున్నవి. ఈయన చక్కని

పండితుడని యిదివరకే చెప్పితిని. 'నాకపురీ కవాట దళనప్రవణ ప్రకట ప్రభావుడు' ఇట్టి సమాసములు వేయుటకు భాషాజ్ఞాన మవసరము.

ఈ కావ్యములో సంఘ సంస్కార మున్నది. దుష్టమైన సంస్కారుల నిరాదరణ మున్నది. కొంత బౌద్ధమత మున్నది. మరికొంత రామమోహనరాయుల మత మున్నది. సంఘ దురాచార నిరాదరణ మున్నది. తెలుగు పలుకుబళ్ల పలుకుబడి సమృద్ధిగా నున్నది. సంప్రదాయమునం దిష్టమున్నది. తద్వ్యతిరేక భావమున్నది. ఈ రెంటిని భాషా విషయకముగా కూడ సమన్వయించు లక్షణ మున్నది. ఇది యొక విలక్షణమైన కావ్యము. ఇట్టి కావ్యములకు భాషలో స్థానమున్నదా? చాటుకవిత్వమునకు భాషలో స్థానమున్నచో చాటు కవితా లక్షణముల బహు సామగ్రిగలిగిన యొక కావ్యమునకు భాషలో స్థానమున్నది. ఇట్టి కావ్యము లాధునిక కాలమునకు మిక్కిలిగా గావలయును. ఇవి యందరకు నర్థమయ్యెడి కావ్యములు. మనము మాటాడుకొను బాసను సముద్ధరించు కావ్యములు ఈ కవిగారు ఇతోధికై తాదృశ కావ్యరచనాధురంధరుడై తెలుగు బాసకు మేలు సేయుగాత.

విశ్వనాథ సత్యనారాయణ,

బెజవాడ. 11-9-53

—o—

# పరిచయము

'కృతిపతి' అను నీ గ్రంథమును రచించిన శ్రీ. జనార్దన శాస్త్రిగారు నాకు చాలకాలమునుండి మిత్రులు. సంప్రదాయ బద్ధమైన సంస్కృతాంధ్రముల పాండిత్యము-సంస్కారలబ్ధమైన రసికహృదయము కవిగా వీరికున్న యోగ్యతలు. నేటికాలమున కవుల మనుకొను వారిలో చాలమంది యందు లేనిగుణము లివి.

ఈ గ్రంథమునందు రెండుఖండిక లున్నవి. మొదటిది 'కృతి పతి' అను చారిత్రకగాథ. రెండవది 'సీతమ్మ' యని పేరుపెట్టి వ్రాసిన ప్రబోధమయకావ్యము. కాని ఈపుస్తకమున మొదటి కథ ముఖ్యమనియో, తాము రాయలసీమవారై రాయల నెక్కువగా ప్రేమించుటవలననో, కవిగారు కృతిపతియనియే యీకావ్యమునకం తయు పేరుపెట్టిరి. రెండవ ఖండికలో సీతమ్మను గురించి యేమియు నెక్కువగాలేదు స్త్రీవాచకమునకు పర్యాయపదముగా నా పేరును రచయితలు తీసికొన్నారంతే. ఆ పేరెంతయు సముచితముగా నున్నది. తెలుగువారికి సీతారాము లన్నంతనే కోటిభావములు రేగును. ఆంధ్రజాతి-అయోధ్యాధిపతి ప్రణయమును, కన్నీటిని గూడ ప్రేమించినది. గాంభీర్య ప్రతీకములగు సీతారాములు ప్రియమైనంత లీలావతారుడగు శ్రీకృష్ణుడు తెలుగుజాతికి ప్రీతి పాత్రుడు కాలేదు.

గ్రంథకర్తలు కావ్యమును 'బోశి-ఉద్దర' మొదలైన మాం డలిక పదములతో 'వేయేండ్లపైరు' మొదలగు పలుకుబళ్లతో

నిత్యసుందరముగ నిర్వహించినారు. వీరి భావములు లలితము లైనవి. అంతకన్నను లలితమైనది వీరి భాష. ఒక్కసారి వీరి కలము కఠినముగ మందలించినను-అది పల్లవగ్రాస కషాయకంఠ ముగనే యుండును. తెనుగు కవులలో నిది యొక ప్రత్యేకజాతి. నేటి యువకవులు పెట్టు పొలికేకలలో వీరమృదు రణితము వినబడు టలేదు. అది తెనుగుల దురదృష్టము.

సీతమ్మ యను ఖండికలో కవిగారు స్త్రీమూర్తి నెంతో యార్ద్రమనస్కులై చూచినారు. కట్టకడపటి పద్యము-ఆర్య ధర్మము స్త్రీ నేదృష్టితో చూచినదో విస్తరింపుచున్నది. ఈ ముగింపు చాల సుందరముగ సున్నితముగ నున్నది కాని, 'ఆంగ్ల వాసనా దూషితుల' కిట్టి మందలింపులు పనిచేయవు. మున్నూ రేండ్ల దాస్యముతో వారి ధర్మము మొద్దువారి పోయినది. వర కట్నముల దీసికొను-అసంస్కృతులను గ్రంథకర్త యెంతయో హృదయవిదారకముగ దండించినారు కాని యీనాగరకులు విం దురా? వారు చదివిన చదువు వారిని విననివ్వదు. ఇంట వయసు గల భార్యల పెట్టుకొని సానివాడలం దిరుగు సరసులను, తామే వొ తమ ప్రవర్తనమున హంసపాదులు వేసికొనుచు స్త్రీలదోషముల నెత్తిచెప్పు దుర్మతులను, విభూతి పిల్లులై, నిత్యపారాయణములతో, నిత్యపరనారీ దిదృక్షతో కాలము గడపు సనాతనం మన్యులను నొకరినేమి? అనేకులను కవిగారీఖండికలో దడవినారు. విషయ ముతో పెనవేసికొన్న రచనాధారాళత 'నాగవల్లీపూగ సంసర్గ' రమ్యముగ నున్నది.

'కృతిపతి' అను ఖండిక గువ్వల చెన్ననికథ. అల్లసాని పెద్దనగారు అచ్చపు ప్రవరుఁడై సాక్షాత్కరించినారు. మనుచరిత్రలో 'కూకటుల్ గొలిచిచేసిన కూరిమిసోమిదమ్మ' కాపురమెట్లు తీర్చెనో మనకు తెలియదు. ఆమెతో నొకమాటయుఁ బలుక నివ్వలేదు పెద్దన్నగారు. ఈ కావ్యమునం దామెయే-అచ్చముగ నామెయె-పట్టుమని పదివాక్యములు పలికినది. బాగుగా పలికినది. గువ్వల చెన్నని చేత గ్రామ్యభాషను కవిగారు పలికించిరి. ఆభాష యెంతయో పాత్రోచితమై యున్నది. బహుశః వారప్పుడు మనుచరిత్రలోని చతుర్థాశ్వాసమును దలచికొన్నారేమో? ఈ ఖండికలో ప్రతి పద్యమును శబ్దముచేతనో-భావముచేతనో-మనుచరిత్రలోని పద్యములను దలపించునదిగా నున్నది. ఇదియొక యపురూపమైన వ్యంగ్యమర్యాద. ఈ గ్రంథరచయితలు పెద్దన్నగారిని ఆత్మీయముగ ప్రేమించిరి.

సిద్ధహస్తులగు కవులవిషయములో 'ఇక్కడ ధార బాగున్నది. ఇట పదౌచితి బాగున్నది' యని వ్రేలుపెట్టి చూపుట వారిని వెక్కిరించుట. ఈ రచనమునం దుత్తమ కవితాగుణము లన్నియు నున్నవి. ఇట్టివారు ఓపికతో-అనుత్సాహమునకు లోనుగాక అనేక కావ్యముల వ్రాయవలె నంతే.

పుట్టపర్తి నారాయణాచార్యులు.

# అభినందనము

మిత్రులు శ్రీ జోస్యం జనార్దనశాస్త్రిగారి "కృతిపతి" "సీతమ్మ" అను కావ్యఖండములు చదివితిని. ఇవి ఒక వృంతమున వికసించిన రెండు పువ్వులవలెఁ బరిమళించుచున్నవి. కాని ఆ పువ్వులకొప్పిన పరస్పర సాదృశ్యము వీనికిలేదు. ఈ రెంటి రూపురేకలు వేరు-రసభావ పరిణతులు వేరు.

జనశ్రుతిలో నిలిచిన గువ్వల చెన్నని కథ యొకటి యాధారముగాఁ దీరినది ఈ 'కృతిపతి.' రాయలనాఁడు సాధారణ ప్రజలలోఁగూడఁ గవితాభిరుచి యెట్టిదో, ప్రజలును ప్రభుత్వమానాఁడు కవులను గావ్యముల నెట్లాదరించి గౌరవించుచుండెనో కన్నులఁ గట్టినట్లుగా వర్ణించుచు, నీ కావ్యకర్త ఉత్తమ సాహిత్యము ప్రజాజీవితము నెట్లు సుభిక్షము చేయునో దానిని ధ్వనిమర్యాదతో హృద్యముగాఁ జర్వణయోగ్యము చేసినాఁడు.

సీతమ్మ యను నొక భారతయువతి రామునిసీతమ్మ నుద్దేశించి తన హృదయావేదన వెల్లడించు భావాలాపము 'సీతమ్మ.' ఇందలి విషయ-మీనాఁడు భారత స్త్రీ జీవితమును నలువైపుల 'అంతర్బహిశ్చ' అలముకొన్న బహుళ సమస్యాజటిలమైన భావ పరంపరా వాగుర. ఈ కవి నేఁటి భారత స్త్రీ హృదయమున నిలిచి, యీ వాగుర నన్నికోణముల నుండి కదలించుచు ఇప్పటి సాంఘిక వ్యవస్థతో-ప్రాచ్యపాశ్చాత్య సంస్కృతి సంప్రదాయముల సంఘర్షణముతో-వర్తమానమును విమర్శించుకొని భవిష్యత్తును భవ్యముగా నిర్మించుకొను నాకాంక్షతో నన్ని దృక్పథముల

వెంట నామె హృదయము నుండి గుబులుకొనివచ్చు భావములఁ బుడికి పుచ్చుకొని, సకరుణముగ సానుతాపముగ సవిమర్శముగ సోపపత్తికముగ రసమయ పద్యబంధము సృష్టించినారు. ఇంత చేయునప్పుడు గూడ నీయన తన లేఖినిని శాస్త్రకర్తగా కాక సంఘ సంస్కర్తగా కాక, కేవల ధ్వనికావ్యకర్తగనే నడిపింప నేర్చుట ఈయన రచనలో విశేషము

ఈ రెండు ఖండములలో భావబంధమున కనుగుణముగా నియన పరిగ్రహించిన పదబంధముకూడ మిక్కిలి సరళము-సహజము. శయ్యాసుకుమారము. తెలుగు జాతీయములు పలుకుబళ్లు సామెతలు నిండు నిండార వెలసినవి. పాత్రోచితమైన గ్రామ్య పరిభాషము, కాలోచితమైన శిష్టవ్యావహారిక ఫక్కియు నిందలి క్రొత్త పోకడలు. నియమబంధములు సడలించుటో స్వచ్ఛందముగ మార్చుకొనుటో యనుసరించిన యీరచన స్వతంత్రమగుపించును. వివిధవిన్యాసములతోఁ గవిత చెప్పుటయం దీయనకుఁగల ప్రోడతన మున కిదియొక తార్కాణ మనఁదగును. ఆస్వాదన చతురమగు రసికలోకమున కిదియొక విందుకాఁగలదని నా విశ్వాసము.

శ్రీ శాస్త్రిగారి కితోఽధికముగ నిట్టి కావ్యరచనోత్సాహము చేకూర్చి భగవానుఁడు చిరాయురారోగ్యములఁ బ్రసాదింపుఁగాక యని కోరుచున్నాను.

గడియారము వేంకటశేషశాస్త్రి,
మహాకవి, ప్రొద్దుటూరు.

---

అభినవబాణకవి-ఆశుకవి చక్రవర్తి-కవిసార్వభౌమ
విద్వాన్, గౌరావఝుల రామకృష్ణశాస్త్రి-శతావధాని
మునిసిపల్ హైస్కూలు, తెనుగు పండితుడు, కర్నూలు.



విద్వన్మణీ!
తమ రంపించిన సత్కృతిం జదివి మోదంబందితి న్మిత్రమా! అమృతం బొల్కుచు నుండె నెల్లెడల శయ్యాపాకరీత్యౌచితీ క్రమవృత్తిచ్ఛట లింపునింప సుకవీంద్రశ్రేణి శ్లాఘింప సత్తమ మార్గంబున సంచరించెను భవత్కావ్యంబు నవ్యంబుగన్.

శ్రీనాథ కవివచస్సీమంతినికిం బోడం
బుట్టువౌ నొక్కొక్క పట్టునందు
అలసాని వారల యల్లిక జిగ బిగి
కనుపట్టు నొక్కొక్క కాలమందు
ధూర్జటి కవి గ్రామ్య ధోరణిం బరిహాస
మాడును నొక్కొక యదనునందు
ముక్కు తిమ్మనగారి ముద్దుపల్కుల సొంపు
సాటించు నొక్కొక్క సమయమందు
పిట్ట చిన్నది కూతలు పెద్దవనెడు
రీతి నీచిన్న పొత్తంబు ఖ్యాతిం గాంచు
యువకవివి మంచి యోపిక యున్నదిపుడె
కావ్యనిర్మాణమున బేరుగాంచుమయ్య!

# ఆమోద ముద్ర

శ్రీ సచేత స్సుహృదులు బ్రహ్మశ్రీ జోస్యము-జనార్దనశాస్త్రి గారు భవ్యభావుకులు. పండితులు. కవులు. అధీతి బోధాచరణ ప్రచారములు కలయాచార్యులు. కవికి వలసిన వ్యుత్పత్తిప్రతిభాభ్యాసములు కల కవివత్సలులు. నానాట వెలసిన వీరి నానాకవితలు తత్తద్భావుకులకు స్వసంవాద వాసితములై యామోద ప్రమోదములు కూర్చినవి.

జోస్యము నవకృతి 'కృతిసతి.' గువ్వల-చెన్నఁడు కృతిపతిగా సంభావితుఁడు. లోకదృష్టిలో పామరుడైన చెన్నడును కృతిపతి యయినాడేమి? యని కృతకావ్యులు భావిత కవితలును భావాలోచన మొనర్పనక్కరలేదు. గువ్వలవాఁ డార్థికముగ నట్టిఁడు కావచ్చును. సారస్వతీయుఁడుగ నతాదృశుఁడు. అందుననే కృతిపతి యయ్యెను.

కృతిపతిలోని వస్తు విట్లున్నది. రాయలసభలో నల్లసాని పెద్దన మనుచరిత్రము వినిపించెను. అనవ్యకవితను రాజు మెచ్చుకొనెను. రసికులౌననిరి. బోయయొకఁడు మిక్కుటముగ మెచ్చెను. మంత్రి తిమ్మరు సాతనికి బంగారు కంకణ మిప్పించెను.

ఒకప్పుడు ముసురు పట్టినది, అన్నిపనులాగి పోయినవి. పెద్దన యింటిదగ్గర కుటీరమున వసించు దరిద్రదంపతులు పవిత్ర వర్తనులు వంటకు కట్టెలులేక బాధపడిరి. 'పెద్దనగారి కేలోటు లేదు. మీరడుగుఁడు' అని భార్యయనినది. 'అడిగితిని; ఇల్లాలే యెరుగును. నేనెరుగనని పెద్దన యనె' నని భర్తయనెను. తడి

పుడకలతో నగ్నికార్య మొనరించిన పెద్దన 'ఈముసురులో నీవెట్లు వేగుచుంటి' వని ధర్మపత్ని నడిగెను. 'ఎట్లో సాగుచున్నది. మన కేమి ? ఎండు పుల్లలు ఇతరుల కేవియు లేవు. ప్రక్కవారు బాధ పడుచున్నారు' అని మాటలాడుకొనిరి. కాని యీ యెండువి వేయు వాండెవండు ? గుర్తింపవలెను. దినదిన మెండు మోపు దొడ్డిం బడును. వేయు మానిసి తెలియలేదు.

ఒక వేకువ తోటలో పెద్దనయు భార్యయు వేయు వానిని గుర్తించుటకు యత్నింపసాగిరి. కోడి కూసినది. దభాలున మోపు పడినది. వాని రమ్మనిరి. వాండు బెదరుతో నిలిచెను. "నీవెవం డవు? ఇట్లేల చేయుదువు? భయమేల? ఎవరిట్లు చేయమనిరి?" "సొంతము నేనే వేయుచుంటిని." "ఏల? నీకేమి కావలెను? అని పెద్దన ప్రశ్నించెను "మేము కట్టెలవారము. పిల్లలు లేరు. నా భార్య యమ్ము మోపు మాతిండికి చాలును. మీకై నేను వేయు చుంటిని" అని బోయ యనెను. "నీవే రసజ్ఞుండవు. ఆనాటి సభలో నీవిషయము తెలిసినది. ఇపుడు గుర్తు వచ్చినది" అని పెద్దన పల్కెను. వాని నభినందించెను. వాండు గువ్వల చెన్నండు.

రాయలొకనాడు కొలువుండెను. పెద్దన యాసన మలంక రించెను. అందరు వచ్చిరి. ఏలనో తెనాలి వాడు మాత్రము రా లేదు. పెద్దన రాయలాంధ్ర భోజుండనెను. భట్టుమూర్తి స్తోత్రము పలికెను. అంతటి వాండు లేండనెను. సవాలు చేసెను. "సవాలు వలదు. ఇట్టి కవితాభిమాని కలం"డని ఒకమాట జనసంఘమునుండి యెట్లో వెలువడెను.

ఒకనాడు తెనాలి రామకృష్ణుండు మారువేషమున నొక

పరదేశితో మాట్లాడుచుండెను. రాయలాంధ్ర భోజుడని యా
వేద విదుఁడచటికి వచ్చెను. రాయ లాతని కేమియు నీయలేదు.
అతఁడితరుల పద్యము వల్లించి వినిపించెను. రాయల సభలోనివా
రది గుర్తించిరి. ఆపరదేశి తెనాలి సాయమడుగఁ దలచెను. మా
రు వేషముననున్న రామకృష్ణుఁడు ఆవిప్రుని గువ్వలచెన్నని సమీ
పమునకు తీసికొని పోఁదలచెను. చెన్నని భార్య రాయలు బహూక
రించిన బంగారు కడియమును తన కిమ్మనినది. చెన్నఁడీయలేదు.
ఇంతలో విప్రుఁడువచ్చి రామకృష్ణుఁడు చెప్పిన పద్యమును వేద
స్వరము కలిపి పలికెను అందు చెన్నని పేరునున్నది. చెన్నఁడు
పరవశుఁడై కంకణమిచ్చెను. అదే పద్యమును వేరొకఁడువచ్చి రస
శ్రావ్యముగ చదివెను. గువ్వలవాఁడు హృష్టపుష్టుఁడయ్యెను. క
ట్టెలు కొట్టు తనగొడ్డలి నాతని కిచ్చెను మారువేషమున నంతయు
కనిపెట్టు రాయలపుడు వారి యెదుటికి వచ్చెను. వినయవివేకముల
తోడి వితరణముకల గువ్వల చెన్నఁడొక్కఁడే నాకంటెను కృతిపతి
యని రాయ లని తన కంఠహారమును సత్కృతిపతి చెన్నని కంఠసీ
మయందమర్చెను.

ఇది కృతిపతిలోనికత. ఎనిమిది యవాంతర ఖండములుగల
ఈఖండకృతిలో 187 కావ్యఖండములున్నవి. అన్నియు చెన్నని
ప్రాధాన్య నిరూపణ ప్రవణములు. నిరూపిత కథాకృతిలోని కృతు
లన్నియు పరస్పర మంగాగీశోభతో నైక్యముపొంది యున్నవి.
ఇట్టి కృత్యైక్యమభినందనీయము. కృతిపతిలో గువ్వలచెన్నఁడు నా
యకుడు. పామర ప్రకృతి కృతినాయకుండగుట మన కృతులలో
సుప్రసిద్ధముకాదు. భూసుర పాలకులె కృతినాయకతా భాజనులని

ప్రతీతము. కాని యన్యులు నాయకపదమున నుండ రాదను నిషేధముండరాదు. లేదును. కావ్యవిశేషములందిట్టి ఘటనము శ్రుతపూర్వము. ఇందలి నాయకుఁడు గువ్వలచెన్నఁడు. గువ్వలచెన్నఁడు కృతిపతి అనుటకన్న కృతిపతి గువ్వల చెన్నడనుట బాగు. చెన్నని విశిష్టత కృతిపతిత్వము, దాన నీతఁడు కృతిపతి యయ్యెను. అందునన జనార్దనశాస్త్రి కృతిపతి యని పేరుంచినారు. సాంఘికముగ చెన్నఁడు పామరుఁడు. కాని భావపామరుఁడుగాఁడు, చెన్నని రసికత-వితరణము సర్వముఖ్యవ్యక్తుల దృష్టిని కేంద్రీకరింపఁజేసినవి. ఒకచిన్ని లోకదంతకథ నాధారించుకొని జోస్యము వ్రాసిరి. ఇందలి చారిత్రకతకన్న కామనీయకతకే కవికలము కదలినది. జనార్దనశాస్త్రి తాను పెద్దన యై స్వానుభూతిఖ్యాతికై దీనినిట్లు దర్పణీకరించెనా ? కవుల కావ్యభావనా విదగ్ధత యతిరోహితముగ కవితలో నుండును.

పాత్రవైవిధ్య మిందొక చిత్రీకృతి. ఆ యా కథావ్యక్తుల ఉక్తిప్రత్యుక్తుల సమ్మేళనము మాండలిక కతిపయ పదఘటనము. గువ్వల దాంపత్యపుబాస యిందచుంచిత రమ్యతం గూర్చినది. కవి ప్రకృతిని వర్ణించి యందు కవితా భావము కూర్చెను ప్రకృతిలోని జోస్యమును జోస్యము గుర్తించినారు. 'నవ్యంబైన కవిత్వపుఁ సరణి' నున్న 'మంచికవి నేడనైన మన్నించుతారు.' 'వ్యంగ్య ప్రధానంబుగా భావావిష్కరణంబు సేయుట' కవికభీష్టము.

ఇందు మూఁడు దంపతుల వేఱు వేఱు విశేషములు కూర్పుం బొందినవి దాంపత్యశోభాస్పదమైన విశేషమునే కవి యందీయఁదలఁచెను. తద్రూపవైభవముల రూపించుట కావ్యార్థము కావలెను.

మనుచరిత్రము విని మెచ్చునేర్చిన చెన్నఁడు తన పేరుగల పద్యము నాస్వాదించి మనుచరిత చర్వణాచిహ్నమైన కంకణ మిచ్చెను. అదే పద్యమును స్వరభేదమునవిని జీవికసాధనము పరశు విచ్చెను. చెన్ననికి యశఃప్రీతి యన్నదేమి? యుననేల? దానియునికి సరి సంభావ్యము కారాదు. అందుననే జోస్యము శాస్త్రిగారును కృతివిశేషకీర్తనముకన్న కృతిపతి విశేష సంకీర్తనమే ముఖ్యమని భావించెను.

## సీతమ్మ

ఈ గ్రంథ గ్రథనము పొందిన వేఱొక కావ్యము సీతమ్మ. తెనుఁగుపేరు. ఆంధ్రవనితా వేదనాత్మకమైన ఒకకరుణామయ సన్నివేశ మిందున్నది. తెనుగునాట వనిత యాడిగోడును పూతచరిత సీతమ్మ నుద్దేశించి పల్కును 231 పద్యములలో స్త్రీవేదన సారించినది. ఏ పద్యమున కాపద్యము స్వయంపూర్ణమై ముక్తకాకృతి వహించినది. ఒక్కొక్క ప్రస్పందిత స్వస్పంద సుందరభావము స్వమాత్రమితిలో సన్యాసపేటికముగ కూర్పుపొంది ముక్తకమగును. ఐనను పరిప్లుతవేదన ధారావాహికమై యంతట వ్యాపించినది. వేదనాసూత్ర మీ ముక్తక ముక్తములలో ననుగతమైనది. ఇందు జోస్యము శాస్త్రిగారు వడపెట్టిన మాండలికము లుపయోగించి రాయలసీమజీవము చూపినారు. ఇది నరులొనర్చిన నారీభావమైనను జనార్దనశాస్త్రి స్త్రీయగుటయు నతిరోహితమని నేను భావింతును. ఇందు కవి నవకాల సంస్కారమను విస్లుతచర్యా విధులకు విముఖుఁడు. 'స్త్రీభావన యిందు భావ్యమాన సుందర

ముగ నున్నది. అవశ్యముగా నిది సచేతో హృదయములకు ద్రవీ భావ మిచ్చితీరవలెను. పతితమైన సామాజిక రీతినీతు లిందు వర్ణితములు. ఇట్టి సమాజవినిపాతమునకు హేతు వెవరు? పురుషుల చాపల్యమె హేతువని జోస్యముమాట. అదికాకపోదు. అర్థనీ తుల దృష్టిలో నర్థవ్యత్యయము హేతువు. అది సర్వానర్థములకు దారియని వారివాదు. అందునను ధర్మవ్యత్యయమె సర్వమూల మని నేనందును. కొందర రనర్వాచీనులు స్త్రీనింద యొనర్చిరి. స్త్రీనిందార్హమా? మంచితల్లి మంచి యత్త, మంచికూతురు, మంచికోడలు, మంచి ప్రాతివేశిని, ఎన్నడును నింద్యకాలేదు. తాదృశలను నింద యొనర్చి యేరును నోట పురుగులు వేసికొన లేదు. సువిస్తృతమైన స్త్రీగో డిందున్నదంటిని. ఈస్త్రీ మధ్య వర్గములోని స్త్రీ. ఉదాత్త ధనివర్గవనిత, యీ వెతలంబడుటలేదు. అనుదాత్తా౽ధన యధర్మముఖ యర్థముఖ కానంత వర కాపత్ప రాధీన యగుట కానను. అటు ఇటు కాని వనితలకు కొన్ని వెత లున్నవి. కొందరు వాని తెచ్చిరి. కొందరుకొని తెచ్చిరి. ఈ క్రియాశూరలు కొందరే. అయినను బహురూపలై సంఘమున కనుపట్టుదురు. వారు, వారి వారు, అట్టివారు సమాజమున తలచి తలపక తెచ్చిన యొడుదుడుకులు 'సీతమ్మ' కావ్యమున సృష్టి హేతువు లైనవి. వేదనాత్మమగు అంతర్వృత్తి.కావ్యనిదాన మయి నపుడు వేదనానివృత్తి, సంవేదనప్రాప్తి ఫలీభూతముగ నుండును. ఇది మానికమైన యాధారభావముగ నీకావ్యము భావించు భావుకులు స్వసంవాదముదితులు కాగలరు.

భారత ధర్మపరాయణమతులు పుత్రకాంక్షతో పుంసవన

మాచరించుటలో ఉత్తర గత్యన్వేషణ మున్నది. ఐన నది భావస్వా
త్యయమున కన్యానిందా పర్యవసానము పొందినది. అది అట్లు
కాగా, జనకుల దుశ్చింతలు-వృద్ధవరులకు కట్టిపెట్టుటలు-అనను
కూల దాంపత్యము-మూర్ఖవరులు-దేబెలు-భ్రష్టబంధువులు-కట్టడి
కూళలైనారు. తండ్రి ధనాశ యెంతయో చేయుచున్నది. శాస్త్రీయ
దృష్టి కల్మాషితమైనను కన్యా వివాహ మనుపేరిట పేరుగల
వారొనరించు ఆచారములు శాస్త్రిగారిని వ్యథించినవి. కొంతకాల
మునుండి లోకులు దాంపత్యమునందలి యాధార్యము ప్రేమయే
యని తలచుటను శాస్త్రిగారభ్యూహించి, తత్పుష్టిను మోహమున
పలుకఁదగు వలయు వానినిపలికిరి. అదియునష్టప్రాయమగుట దుస్స
హమగును కదా! కట్నము లన్నపేరిట వరదక్షిణాల బాధలు-
అల్లుండ్ర పీడలు-ఆదశమగ్రహముల వేశ్యావాస నివాసములు
ధర్మపత్నీ కోమలాత్మకు గుండ్రాయి పోటులుకాగా, అవనితోచి
త భావములు వెలికిరాక దాగినవికావు. సామాన్యారాగులై రోగ
శయ్యలంబడియు బాధించుటలు లోకమున నున్నవికదా! ఇవియే
కాక విటచర్యలు కొన్ని, వనితల దేహములను చూపులతోడనె
జల్లెడలుచేయుట ధర్మవినిపాతము. స్త్రీ పత్రికాగా పుంవ్యభిచార
ము లెదూరాయఁబట్టబడును. స్త్రీలలో ఇట్టి వుండుననుటను స్త్రీ భావము
పలుకనీయదు అందుననే స్త్రీ పురుషదూషణమును చేయక
తప్పదు. రసాభాసప్రవృత్తి నుద్ఘోషింపక తప్పదు. అత్తలబాధ
లున్నవి. భర్తలబాధలున్నవి. వారే అట్టి పనుల చేయించు
టలు నుండుట యేరికి బాధాకరముకాదు? 'అప్రాచ్యాదృతసంప్ర
దాయములలోనై' జనులాచరించిన వానిని శాస్త్రిగారు విశదము

చేసిరి. రచ్చలనీతులు పలికి రట్టు లాచరించువారున్నారు. రచ్చల కెక్కించువారున్నారు. ఇట్టి వెట్లు సోధన్యములు?

ఈ సాంస్కృతిక విశేషమిం దుద్బోధించుటకై ముక్తక ప్రాయపద్యములలో శాస్త్రిగారెంతయో విశదము చేసిరి. అవశ్యము దీనిని సంభావించుట సముచితము. దీనిలో మానస క్రియాంవ్యగ్రత మూర్తమైయున్నది. దీని భావనా వివేకము పాఠకులకు ధర్మవీరాభినివేశము నుత్పాదించు నందును. అది మతి ధృతి సహకృతమై కర్తవ్యదీక్ష నిచ్చును. దానిద్వారమున మనమును కాంక్షించు సమాజ ధర్మ నిర్మాణ కర్మ మర్మములను శాస్త్రిగారు కాంక్షింతురు.

ఇట్టి గ్రంథము మననపద్యా ప్రవేశమునకై కొంతగా వలసిన వానిని నేనిందు నిరూపించుటకు యత్నించితిని. దీని దాని మరల మరల చదివి భావుక పాఠకులు స్వాత్మ సముల్లాసము పొందుట సముచితము, విషయాసక్తితో కావ్యదృష్టిని విడనాడుట కావ్య లక్షణాసక్తితో విషయదృష్టిని విడనాడుట లోకమున నవ్యవస్థనిచ్చును. ఇందుభయమనుసరించి సువ్యవస్థను చూచుట సుహృదయుల సూక్తిరహస్యము.

జమ్ములమడక మాధవరామశర్మ,
ఎ. సి. కాలేజి, గుంటూరు.

# విన్నపము

ఈ చిన్ని పొత్తమునందలి కృతిపతిలోని కతకు చారిత్ర కాధారములు దొరకలేదు. అసలు వానికై ప్రయత్నింపనులేదు. గువ్వలచెన్న శతకము కర్తృత్వమునుగూర్చి పలువురు పలువిధముల నభిప్రాయపడుచున్నారు. ఇంతకు నిదమిత్థమని తేలలేదు. నాచిన్నప్పుడు పెద్దనగారే వానిని వ్రాసినారని వినియుంటిని. అదే యీరచన కాధారము. తెనాలి వానిని గూర్చియు నిట్టి యభిప్రాయభేదములే కలవు. కాని యష్ట దిగ్గజములలోని వాఁడన్న ప్రతీతిని ఆంధ్రలోక మెన్నటికిని మరవజాలదు. ఇందు నాప్రతీతియె మూలము.

సీతమ్మలో నేటిసతిమతల్లులకు సంభవించు కడగండ్లు ఇంచుమించు నన్నియు నా కనులారఁజూచినవె. అప్పటి నా హృదయవేదన పద్యరూపముఁ బెట్టినాఁడ నంతె. భిన్న భిన్న దేశకాల పాత్రముల సంఘటనల నేకత్ర సంఘటన సేయుటయే నా రచన. అట్టి వ్యక్తులు తమ తమ యవివేకముల భవిష్యత్తునందైన వదలుకొన గలరేమో యనునాసతో బయలువెట్టు పూనికకు గడంగితిని.

ఈ చిట్టిపొత్తముపై సద్భావముతో సదభిప్రాయములిచ్చి నన్నుఁబ్రోత్సహించిన మహాకవి పండిత సుహృదార్య వర్యులకు నా కృతజ్ఞతను భక్తిమెయిం బ్రకటించుచున్నాఁడ.

గ్రంథకర్త.

శ్రీ

# కృతిపత్రి.

మంగళ విజయనగర సామ్రాజ్యలక్ష్మి
ఆంధ్రభోజుని వరియించి యన్యవీర
భయదవీర పతివ్రతాత్వమును సకల
దిశల మాఱుమ్రోయించిన దినము లవ్వి.

దేశభాషలఁ బైచేయి తెనుఁగుదె యని,
కవివరేణ్యులె సత్కీర్తికారకు లని,
సప్తసంతానముల మిన్న సత్కృతి యని,
దెసల మాఱుమ్రోయించిన దినము లవ్వి.

రసపిపాసకుఁ దోడు రాజసామీప్యము
నిశ్శబ్దతను హానశిల్లఁజేయ,
భావపుష్టిని మించి పదసౌకుమార్యము
నలనల్లఁ దలల నుయ్యాల లూప,
పాత్రౌచితికిఁ దగు గాత్రగాంభీర్యము
స్తబ్ధత్వమును విశేషముగ నింప,
విప్పి చెప్పుట కంటె మెప్పువాక్యంబులు
నుల్లంబు నింకింత యుబుకఁ జేయ,

సభ్యులందఱఁ జిత్రానుసరణిఁ జేసి,
ఆంధ్రకవితా పితామహుం డలఘు లీల
మనుచరిత్రము నొకకొంత వినిచెఁ గృష్ణ
దేవరాయలసభ నొక్కదినమునందు.

భావము శైలిని మించెనో ?
భావమునే శైలి మించి భాసిల్లెడినో ?
ఆవేగం బీరెంటిన్
లో వైచుక ముందు దూకెనో ? ఆకవితన్.

నవ్యంబైన కవిత్వపున్ సరణి విన్నాణంబుగాఁ దోఁపఁగా
శ్రావ్యంబైన పదార్థ సంఘటన సంస్కారంబుచే నాత్మలన్
దివ్యంబైన రసానుభావము మహోద్రేకంబుగాఁ గ్గి, ఆ
దివ్యత్వంబును మానవత్వమును సందీపించె నాయామొడన్.

ప్రత్యూషదర వికస్వర నూత్నకమలగం
            ధము సల్లుపనాంకురములు నొకట,
ప్రప్రభా తాయాత వాతాహతాలోల
            దలసదంత్రుల రాగ కలన లొకట.
మృగమద సౌరభ ద్విగుణిత ఘనసార
            సాంద్ర మహామేల్ పిటిజవురు లొకట,
మహాదైందవ గ్రావ మయకాయమానస్థ
            జటిల ద్రాక్షాగుళుచ్ఛంబు లొకట,

భువిని మాదేశమర్యాద యవునటంచుఁ
జేతఁ జూపఁబలెకన్నవమూఁత లోకటఁ
గుంభగత దీపకళికల కుదురుఁ గూర్చి
మనసు లానంద బ్రహ్మనిమగ్నములుగ.

రాజు మెచ్చుకొనుట రసికు లౌనౌ నంట
కవులు పద్యమాలికలఁ గురియుట
వీని కేమి కొదువ? పేరెన్నికను గన్న
కవులమిన్న చదువుకబ్బమునకు.

అనుభవజ్ఞుఁడు, రసికుఁడు నైనకవికి
ననుభవజ్ఞుల, రసికుల నలరఁజేయు
టొకవిశేషమె? పామర సకలజనుల
యుల్లములఁ బల్లవింపఁ జేయుటయె యరిది.

పేలికలైన చల్లడము వ్రేలఁగ, పీనుల నూలుపోఁగులున్
గాలికిఁ దూలియాడఁ గడకన్ వినుచున్నజనంబుమూకఁ బా
దాలకు నడ్డువాపికొని, తా నటకున్ జని యొక్కబోయ దం
తాలకుఁ గోరమీసములు దాపుఘటింపఁగఁ బల్కె నుల్కుచున్.

"దేవరా! నదువేమియు తెలియనోణ్ణి
మాన్నబాపుఁడు మారాజు మాఁకు తండ్రి
యల్లకాలము కయిగట్టె, మల్ల-సబలు
లెక్కలేనన్ని చేపిచ్చె లెక్కలిచ్చి.

మేము దాన్నించి కైగట్టలేముగాని,
కవులు రాసింది తెల్సుకోఁగలిగినాము
మొదట మోటోల్ల, మిప్పుడు ముందు కొచ్చి
కాలునిల్పింది తమరి పాదాలకాడ.

మన్వి చేసేది యేమంటె మాన్న బావ!
పద్దెములు ముద్దుముద్దుగ పెద్దసామి
కన్న యెవ్వరూ రాసింది యిన్నమాట
గాదు; సెప్పింది సెప్పితే లేదు గొప్ప.

మన పెద్దసామి పద్దెము
లినినా సా లొక్కసారి యేం రసముందో?
యినెనో ల్లందరు తల లూ
పిన వోల్లే బేసుమంట పిన్నాపెద్దా.

మంచికవి నేడనైన మన్నించుతారు
మంచికైతము రాజ్జాన్ని మించుతాది
మంచిబోగాలు వాల్లకు మాటలోవి
మనతో కావాలిసిందేమి? మాన్న బావ!

రత్తనము నుంచుకొంటారు నెత్తిమీద।
దొరికినోని యదుష్టమే దొడ్డగంద!
రత్తనాలు కయీసుర్లు; రాజులల్లు।
వాల్లతో కీరితొందేది కల్లగాదు.

ఎంతటిపున్నెము సేసెనో ।
అంతటి పెద్దయ్యతోటి అక్లాపాత్ర
మ్మంతా తనపేరట ప్రే।
మంతో రాయించుకొన్న మారాజు బలే!

కల్మి బతికినంతకాలము మనకుండ
బోదు; బతుకు నీటిమీదిబుగ్గ
సత్తెమైనసొమ్ము సచ్చినా, బతికినా
మంచిమాట, యిలలో మంచిపేరు.

తనపే రెన్నాళ్లైతే।
జను లనుకొంటారో యిలలో సచ్చినపున్యా
త్ముని కన్నాళ్లే సొర్గము।
అనుబవ మంటారు పెద్దఅయ్యోర్లంతా.

ఈ మన తెనుగురాజ్జాన్ని యెంద రెంద
రేల లేదన్న! వార్ల పేర్లేమొ తెలవు
యేమిటికి? బారతాన్ని రాయించుకొన్న।
రాజరాజరా జొగడె సైర మెలింగె.

ఔర! మారాజుపే రిప్పుడైతేనేమి? ।
ముందుకాలానికైతేనేం మందినోల్ల
మెల్గిపోవాలె, తెన్గుకు యేల్పునాలె।
మెచ్చిరాయాలె బంగార మచ్చరాల.

ఎచ్చుగా రాజైమింత కూర్చొచ్చుగాని
సచ్చిబతికైన దనము సేర్చొచ్చుగాని,
పేరు మారాజు లెక్క నిల్పేదికల్ల
వాల్లకీల్లకు యీమాంద్రివల్లగాదు.

పిల్వాని పేరంటంగా
కొల్వున నామోటు జొల్లుకూతల కూస్తిఁ
తెల్వేమి లేదు యేరే
తల్వక మీకొడుకు లెక్క తల్సండయ్యా

ఏలినోరికి సాల దండాలు సేతు
పెద్దసామికి దండాలు వెయ్యిజేతు
మల్లదండాలు మిగత పెద్దోల్లకల్ల
దయను బన్ని మన్నించండి తప్పులన్ని."

అనుచుఁ సాగిలి మ్రొక్కఁబోయను సమర్యాదంబుగాఁ జీరి, చందన తాంబూలము లిచ్చి, మెచ్చుకొని, సద్యః ప్రీతిగా హైమకంకణ మిప్పించెను మంత్రి తిమ్మరుసు; భూకాంతుండు కన్నన్నచే తన చెప్పఁ వినువారి కెల్లఁ బనిచెఁ దాంబూల దానంబులఁ.

---

# కృతిపతి

## 2.

విజయనగర మహీజాని ప్రజకుఁ బూర్ణ
జీవన ప్రదాత యని వాసిని గడింప
నీసుగాని యేమొ? జీవనరాశిఁ గుమ్మ
రించె నటు గుడ్డిగ నవాంబు భృద్వరుండు.

కవి రాజ హంసలఁ గష్టాలపాల్సేయు
  నొక్కఁ డాశ్రయ మిచ్చి యోము నొక్కఁ
డొకఁడు కొంపలు కూల్ప నొక్కఁడు కూలిన
  నిలయంబులను జక్కనిలువఁబెట్టు
నాదరోక్తు లొకని వశనిపాతమ్ములైన
  నాపాతమధురమౌ నన్యుపల్కు
జడమలినాత్ముఁ డొక్కఁడు, మరియొక్కఁ డ
  నన్య సామాన్య చైతన్యమూర్తి

ఒక్కవితరణమున సామ్యమున్న నేమి?
యూరక ఘనపదము నేతిబీరకాయ
వంటి నామమాత్రమె వారివాహమునకు
అధిప శ్రీకృష్ణదేవరాయండె ఘనుఁడు.

క్రమ్మకొన్న ముసరు కుమ్మిక విడలేదు
  కారుమబ్బులుకాలు కదపలేదు
ఉడుగలే దురుముల గడగడ గర్జన
  లెడలేదు మెఱుపుల తళతళలకు

చివికించు చిత్తడి చీదర చెడలేదు
చెనటి బొల్లీవర చెదరలేదు
వెలియ లే దలకుంభ వృష్టిసంపాతము
తటుకాఁగ లే దిండ్ల చిటుకు పాటుకు

తుంగభద్రా తరంగిణీ తుంగభంగ
తోయపూరంపు వేగము తీయలేదు
కూలిపోవు కుజములకు కొంపలకును
లెక్కయే లేదు తీసెడి దిక్కులేదు.

అనివార్య రాజకార్యము లాగుటకు మంత్రి
కార్యవర్గము మదిఁ గలఁతఁ గూరె
వెతలకుఁ బాలయ్యె బేహారికూటము
లంగళ్లఁ దొలి బోణియైన లేక
మధ్యాహ్న సూర్యనమస్కార మబ్బమి
విగత భోజనుఁ డయ్యె వేదజనుఁడు
కాపులు విత్తనాల్ పైపెట్టులై పైర్లు
కుళ్లునేమో యని కుందుకుడిచి

రోలిఁబెట్టిన పెండ్లిమూర్తాలు జరుగ
జందెముల ముడివైచెఁ బంచాంగమయ్య
దెప్పరపు వెతలఁ బుర మె కప్పరపుల
నోయి! యిఁక వాన చాలు మొఱ్ఱోయనంగ.

అది విజయనగర పట్టణ
ము దివాణము ప్రక్కవీథి, పొరుగున భాగ్యా
స్పద మల్లసాని పెద్దన
సదనముగల యొక్క చిన్నసజ్జక, మందున్.

తడవుల నొక్కదంపతు లుదార విచార పవిత్ర జీవనుల్
గడుసుందనం బనన్ నగవుకైన నెఱుంగని సాధువర్తనుల్
పడుచుందనంపుం దుందుడుకు పాఠము నేర్వని యొజ్జలో యనం
బడి నివసింతు రొండొరులు పాలును జక్కెరబోని కూడికన్.

ఆయజమాని మానితుం డహర్నిశముల్ తగులొండులేక స్వా
ధ్యాయపరాయణుండు, పరమాత్మ రహస్య మహానిరీక్షణే
చ్ఛాయత మాన మానసుండు, శాంతుం డయాచిత వృత్తి జీవికా
ధ్యాయ చరిష్యమాణ నియతవ్రతదీక్షితుం డుజ్వలుండునౌ.

ఇవి అవి తెచ్చిపెట్టుమని యెన్నడు నేడ్వదు నేడిపింప దు
న్నవె పదివేలు చాల్నని మనంబున సంతసమందు నిచ్చలున్
ధవునకు భక్తియుక్తముగం దత్పరతన్ బరిచర్యచేయు, నా
యువిద గృహంబుం దీర్చు మగం డున్నవి లేనివి చూడకుండినన్.

అటు బయటి కడుగుపెట్టం ।
డిటు తేమాన్యములులేవు, హీనపుగతి గా
కట్టం బోరు, వారికాపుర ।
మెటు జరుగునో? దైవమైన నెరుగునో? లేదో?

"ఏమండీ! యెడతేనివాన లిటులే యెన్నాళ్లు వేధించునో?
యేమో? యెండిన కట్టెపుల్లలయిపోయెఁ, నుగ్గులుఁ బొగ్గులున్
ధూమం బైనవి, కందిగోగు గోలుకూచల్ దంట్లు దబ్బల్ మఱే
మేమో చేరిచి, తిప్పలఁ బడుచునే యిన్నాళ్లు సాగించితిఁ.

వేన్నీళ్లు కాచుకొనుటకు।
నున్నను లేకున్న మానె నొకపూటకునే
నన్నంబు నుడుకఁ బెట్టుట।
కన్నను బొఋమంట సేయుననువె లేదే.

అమ్మాంరావుగదా! బదుళ్లో సదులో యాచించియో తెచ్చుకో
గుమ్మంబే విడరాని పెన్మసరు నిక్కంబెక్కె। నానాటికిఁ
దిమ్మై యెండిన కట్టెపుల్ల కరవౌ, తెప్పింపలేరేరు, ని
త్సమ్ముఁ బెద్దనగారలొక్కరెటులో యాజ్ఞించుచున్నారట.

ఎండిన కట్టెపుల్లలకు నేమి దరిద్రము వచ్చెనో? యిదే
మండి! పురంబులో నెవరికైనను పుల్లయుఁ బుట్టదంట, యే
కొండలు మండిపోయినవొ? కోరినయన్నిఁ గడించుచుండు నా
క్కండతఁ డద్దిరా రవియు గాననిచోఁ గవి కాంచునే గదా!

ఉప్పో? పప్పో? యెవేని లేనియవి యొక్కొక్కప్పుడే నడ్డగా
నిప్పిం చప్పుడె; మారుసెప్ప దెపుడా యిల్లాలు; నేనీయఁబో
నప్పులేదనిచెప్పి పుచ్చుకొన దేనాయుద్దరల్ తెచ్చుకో
నొప్పిం జెందుదు, గట్టెపుల్లల కెటుల్ నోర్విప్పి యాచించుటఁ?

ఏమగవారి కేమెరుక? యీజడి నేబడి వంటసేయుచు
న్నామొ? గవాక్షి వేసికొనినన్ బాగచూరెడి పచ్చికట్టె లే
మేమిగ వంతఁ బెట్టెడినొ? యెట్టులు కన్నులు కుళ్లిపోయెనో?
యేమగువల్ తపించియు సహించి దినంబులు వెళ్లఁబుత్తురో?

ఆ పెద్దన్నను రాజపూజితుఁ డటం చాబాలగోపాలమున్
బైపైఁ బల్లకి పట్టువారె? యిపు డీవర్షార్ద్రకాలాన, నే
లోపంబున్ గలిగింపకుండ నొకఁ డెట్లో కట్టె లందిచ్చు నం
టాపుణ్యాత్మకుఁ డేరి కేవెలకునే నమ్మందు మోపేసియున్.

ఆయనగారు మిక్కిలి పేయూపరు, లే జను లాశ్రయించినన్
సాయము చేసి పంపుటయె సాజము; నిత్యము మీకుఁ గట్టెలన్
వేయు నతండు నేరికిని వేయఁడు, కొంచెము చెప్పి మాకు నే
దో యొకనాఁడు పంపుఁ డని యొయ్యనఁ డగ్గరి చెప్పఁగూడదా"

"దినగండంబుగ సాగనీడిచెడి నీ తిప్పల్ నిరీక్షించుచున్
మనసస్ట్రాడుచునుందు, నేను నిపు సామాన్యున్ సమీపించి, సి
యుని నట్లు తెలియంగ వేడుకొన, యిల్లాతే విచారించు వా
నిని నేనేమి యెరుంగ నంచు, బలికెన్ నిక్కంబె యైయుండెడిన్.

ఒకసాయం సమయంబునన్ నియత సంధ్యోపాస్తినై, యగ్న్యుపా
సకుఁడౌ పెద్దన జల్లుదాకిన సమిజ్జాలంబు మండింపఁ జా
లక తానున్ సహధర్మచారిణియు నేత్రద్వంద్వముల్ ధూమరా
జకి నీర్వారుచు నెఱ్ఱవాఱఁ గడుకష్టించెన్ హుతం బొటకున్.

“అలి ధార్యంబు ప్రమాద మౌ ననుచు నిర్మథ్యాగ్ని నౌపాసనా
దులు సేయన్ నియతం బొనర్చితిమి చాతుర్మాస్య దీక్షాది, శీ
తల వాతావరణంబుతో నరణి శైత్యప్రాయమై, నీకుఁ జే
తులకున్ దీపులు సంఘటిల్లెను గదా? తోడ్తో మధింపన్ వడిన్.

ఇటు లీహోమ మొనర్చు మాత్రమున కెంతేఁ గష్టముల్ సెందు
చుం
డుటలున్ మాకనుభూత మైనదియ; యెట్టుల్ ప్రాయ్యుకిన్
ముందు ప్రా
ద్దటికిన్ మాపటి దాక నీ ముసురునన్ దంటాలతో వేగుచున్
ఎటు మమ్మున్ మదిం దిట్టిపోయుదురొ మీ రెల్లప్పు డొక్కుమ్మడిన్.

సరసముగఁ బల్కుపతిఁ కె।
వ్వరికే విధ్యుక్తవిధులు వాడుకో? వారా
పరిపాటిఁ జేయుచుందురు।
బరువో? సుళువో? యటంచుఁ బలికెన్ సతియున్.

“మనకే మెండిన కట్టెపుల్ల లిటు చెమ్మందాకి యున్నందు కే
కను నీర్గారినమాత్ర నేమగు? మహాకష్టంబొ? బంగార మై

నను పుట్టుఁ బొడిపుల్ల పుట్టదఁట విన్నారా? పురిఁ వానకుఁ
మన పక్కింటనె వేదరా లొకతె వంటఁ మానినా నంచనఁ.

అనినఁ జ్ఞప్తికి వచ్చె నీ దినమె యా నాసాధ్వి నన్నడ్గె ని
ట్లని "మీయాయన యెందు కట్టియల నేలాగైనఁ దెప్పించు చుం
దునుగా! వారికిఁ జెప్పి మోపు వెల యెంతో? యొక్కనాడైన మా
కని వేయింపుఁడు మీరె భోజనము మాకై పెటి నట్లయ్యెడిఁ."

ఏమీ? ఆయమ గూడ నిన్నడిగెనా యీసంవిధానం బదే
మో మోసంబుగ నున్నదార! నను నా భూమీసుర శ్రేష్ఠుఁ డ
క్లై మాట్లాడఁగ నే నెఱుంగ నది, మా యిల్లాలె యెవ్వానితో
నో మోపుల్ కొనుచున్న దయ్యా! యని యేమో చెప్పి పంపిం
చితిఁ."

"నాకేమి తెలియునమ్మా!
ఆకట్టెలగొడవ నేన దేల అంటించుకొనఁ?
మీకని మా వారిని రే ।
పే కనుఁగొని చెప్పి మీకు వేయింతంటిఁ."

"ఆల్మగ లట్లు సచ్చరితు లౌదురు; వారు మనిల్లు చేరి, యి
ట్లాల్మగలన్ అదేపనిగ నడ్గిన నిద్దర మిట్లు చెప్పుటన్
కల్మిగలట్టి వారమని, గర్వము మీరఁగఁ గప్పి పుచ్చు చే
ష్టల్మిగులన్ వచించిరని, స్వాంతములం దెటు లేవగింతురో?

పాపము వా రమాయకులు వచ్చినకార్యము కాకపోయె, పో
సి, పరిహాస మాడఁ దగునే? మన మా సరిసాటి వారమా ?
యీపొడిపుల్లలుఁ దిరిపె మిమ్మని వేడితిమా? కలట్టివా
రే పలుకైనఁ బల్కఁగలరే యని యేమనుకొందురో గదా ?

అది యట్లుండ మనింటి కెవ్వరిటు నిత్యంబుఁ దగఁ బుత్తు రే
మిది చిత్రం ? బిటు లెందుపుల్ల కరవా నీ వానకాలంబునం ?
దెదియో దీనికి హేతు? ఎంతకును వాఁ డెవ్వాఁడు తెచ్చిచ్చు? నా
న్నదినా లాయెను వేయఁబట్టి? యెటుగానీ దీనిఁగానం దగుఁ.

అని తమలో నాదంపతు।
లనుకొని పరిచారకులకు నానతియిడి రి
ట్లని, 'మనయింటికిఁ గట్టెలు।
దినదినమును దెచ్చువానిఁ దెలుపగవలయుఁ.

కనిపెట్టవలయు చిత్రం।
బని పనివారలును బొంచి యరయుచు నుండఁ
దినదినము వేయుమానిసి।
గనఁబడకే దొడ్డిఁ బడును గట్టెలమోపుల్.

(ఒక వేసవ నింటి తోటలో పెద్దన దంపతులు)

పెద్దన-

చూచితివా? యుషస్సు కడు సుందర నర్తకి యంచుఁ జిత్ర వా
చా చతురత్వ మేర్పడు పసన్ రస యుక్తిగ వేదకన్యకా
సూచిత వర్ణనా నియతి చొప్పు నిజంబని సాక్ష్య మిచ్చెడిన్
పూచిన లీవబోండ్ల వలపుల్ వెదఁజల్లెడి పిల్లతెమ్మెరల్.

భార్య-

అవునవు నీ యుషర్జనని హాయిగఁ బిల్లల నిద్రపుచ్చి, నీ
రవము ప్రశాంత సాంతరి సరాగ వినూత్న విశుద్ధ హావభా
వ విలస దంతరంగ మృదుపద్మ వికాస ప్రభావు, లోకబాం
ధవు, ధవు నాగమంబునకుఁ దత్పర యౌచుఁ బ్రతీక్ష సల్పెడిన్.

పె-

అదె పూదేనియ దంట దొంగగము లేమేయిండ్ల వాకిండ్ల దూ
రుచ మోరంతయు సందు గన్పడిన నెట్లో యంచుఁ దారాడెడిన్.

భా-

అదె మాపద్మినియున్ బ్రవాసగతుఁడౌ నాత్మేశుఁ డీ దిక్కునుం
డి దయన్ వచ్చుఁగదా యటంచుఁ దలుపున్ డెందంబుతో విప్పె
[డిన్.

పె-

ఇట్టి ప్రశాంతమౌ ప్రకృతి దృశ్యము నందములో విలీనమై
నట్టి మనోలయస్థితిని హాయిని బొందుచు దివ్యసృష్టి సా

ప్రమోట్టు నమేయశక్తి మహిమల్ దలపోసెడి భాగ్యమబ్బె నీ
కష్టైల వాడునున్ మనకు గట్టి సుఖానుభవంబు గూర్చెగా.

ఈ ప్రాసాదములందుఁ బట్టణములం దీరాజభోగంబులం
దీ ప్రాల్మాలిన ప్రాణవర్గములతో నీబందిలోఁ జిక్కి, స్వే
చ్ఛా ప్రాముఖ్యముగన్న యీప్రకృతి దృశ్యంబుల్ విచిత్రం
బుగా
నై ప్రేమింతుము, పల్లెవారల కివే ఆజన్మసిద్ధంబు లౌ.

మా చిన్నప్పటిమాట యొక్కటిదె ధీమార్గంబునన్ దోచె, మా
ఆచార్యుం డల చాల వేకువనె మమ్మావాడు లేపంగ, మే
మాచాయం గలయేటికిం చరిగిఁ డాయంబోయి, యిట్లే లతా
ప్రాచుర్యం బగు చోటఁ బండుకొని నిద్రంబోతి మొక్కప్పుడున్.

ఒక యాగంబున కొక్కసారి యెటో యెన్నోకొన్నిటన్ విప్రుకో
రిక తీర్పన్ ప్రజ దానకర్ణుఁడని యాకీర్తిన్ ప్రశంసించె, కో
రకయే, తెల్పకయే, దినక్రమము వర్షాకాల పర్యంత మి
ట్లు కదన్ ప్రీతి నొసంగు వానియెడ యెట్లున్ జూచునో మీదటన్.

భా-

అవునండీ! యిటు దొడ్డివేయుతల పేమైయుండునో? గుప్తదా
న విధానంబున నెవ్వరేఁ బనుపుచున్నారొక్కొ? తెచ్చిచ్చుచో
నివి దుర్దానము లంచు శ్రీప్రభువువే యేమైనఁ బంపించిరో?
యెవ్వరై యుందురు? కూలినాలి జనులా? తృష్ణావిహీనాత్మకుల్.

పె-

చిరకాలంబు పఠించి, పెద్దలకు నేశిష్యప్రశిష్యాదులో ?
కరుణాపూరిత మానసుల్ సుహృదులో? కల్యాణులే యాప్తులో
మరి రాజాశ్రయ సాధనాపరులు సామంత ప్రజాపాలురో ?
పరమ ప్రీతుఁడు నిత్యపూజితుఁడు నాస్వాహా వధూభర్తయో?

భా-

ఇపుడెట్లో కనిపెట్టఁ గల్గుదుము; మీ కేరీతి మన్నింతురో ?

పె-

నెపముల్ పెట్టక వారిచెప్పినిగానీ కూర్తు; నే నిత్తునే
యపురూపంబగు వస్తువైనను, ద్వితీయప్రేమ యెట్లుండు ?

భా-

నిక్కపుఁ బ్రేమన్ నిరుపేద వారి యెడఁ జక్కంజూపఁ బ్రాపించెదన్.

అటు లాదంపతు లల్లవేకువ గృహోద్యానంబునన్ జీమయున్
జిటుకన్నన్ బెసలెల్ల నొక్కొకరు దృష్టిన్ సారె నారించు చు
త్తట వాంఛామతిఁ బొంచియుండ, సరిదాకన్ దాప్రునాడంబు లే
మిటనైనన్ మ్రుమలాత్మ సాటిగలరే మీ 'కొక్కరొక్కో' యనన్.

కోళులు కూసెఁ గృత్యములకున్ సమయంబని హెచ్చరించెనాన్
వేళ యతిక్రమించు నొకో? వినికిఁ గానయి నేడు స్నానసం
ధ్యాళికిఁ దత్త్వ మారయ నెటైన సరేయని పల్కునంతనో
వైళమ దాపురన్ బడె దభాలునఁ గట్టెలమోపు దెట్టునో.

'ఆఁ' యెటునుండి వచ్చిపడె నద్దిర! కట్టెల మోపువేసి యే
మీ! యెవరల్లు కంచె దరి నేగుచు నున్నటులున్న దెవ్వరో
యీ! యటు పారిపోవ వల దిక్కడ రమ్ము, భయమ్ములేదు, నీ
వే యనుమానముల్ బడఁగ నేటికి నీయెడఁ దప్పులేని దే.

ఆయెలు గాలకించి యలవ్యక్తి రయంబునఁ దొంగిచూచి, తా
నాయెడనే దిగాలుపడి, ఆవల కన్గను వేయఁజాల క
త్యాయత భీత దృష్టులను దంపతులన్ దిలకించి, రిత్తకే
ల్దోయిని గట్టి, గట్టి మది దుందుడు కొప్పగ నిల్చె నత్తరిన్.

"ఈ కడ రేయి యూరిజన మెల్లను నిద్దుర గూరియుండు, వే
రేకడ దొడ్డి నెవ్వరని యేనిటు కట్టెలమోపు వేసితిన్
దాకెనో ? బీతుగూరిచెనో ? తల్లికి దండ్రికి నెగ్గుచేసితిన్
మీకొడుకట్టివానిఁ గరుణింపుడు సైపుడు తప్పులన్నియున్."

తానొక దోషిచందమున దైవముతో మొరపెట్టుకొన్న చం
దాన భయంబు భక్తియుఁ బెనంగొన నంగిన యంగకంబుతో
నానికటోర్విఁ జేరగ రయంబున, దిన్నగ నేగుదెంచి పా
పానతుఁడైన నుత్కట దయామతి పెద్దన వానికిట్లనున్.

"ఎవడవు ? నాయనా! యురక యీగతిఁ గట్టెలమోపువేయుచుం
దువఁట దివక్రమంబునఁ గడుంగడు నక్కజమయ్యెడుం, రహ
స్యవిధిగ వచ్చుటేల? భయమందుటకున్ గత మెద్ది? చెప్పుమా!
యెవరయినన్ బ్రకాశ మొనరింపక వేయు మటంచుఁ జెప్పిరా ?

వ్యక్తి-

అయ్యో! దేవుని తోడు సామి! తమ రిప్పన్నట్లు నన్నెవ్వ రూ
యెయ్యం బొమ్మని సెప్పలేదు, వగయాలై మంద్రిబో, నాకిదేం
పొయ్యే కాలమ? చెప్పకుండ సగరేయ్ పొద్దప్పు తెచ్చేస్తునా?
కుయ్యో! సొంతము బుద్ధితోనె యిటు మీకుం గస్తి గల్గిస్తి బో.

యల్లప్పుడు మావాళ్లీ
పుల్లోనే కట్టెలమ్ము కుండే వాళ్లే
యిల్లూ, నాగొడ్డెండ్లూ
పెళ్లామూ, నేను, మాకు పిల్లా? జెల్లా?

వె-

అయ్యో! పాపము చాలవేదపుకదా? అన్నా? నిరంతంబు నే
మయ్యున్ గట్టెలె పొట్టనింపుకొన మీకాదగ్గు; నిర్దోషమే
అయ్యున్ గష్టపు జీవనమ్ముగు నమీ ఆధారహీనమ్ము, జా
లయ్యెన్ నిన్గనం గూలి యింతనక వెయ్యన్ జూతురా? యీగతిన్

ఎందుకు నాయనా? తెలపకే యిటు కట్టెలు తెచ్చివేయుచున్
ముందుకు ముంచె నిశ్యమొక మోపుగ నెత్తిని మోసి తెచ్చి, నా
కుం దగనట్టి భారమున గ్రుంగగ బల్మిగ నంటగట్టుటల్
ఇందుకు నీకు నావలన నేమి ప్రయోజనమైన గల్గునా?

ఎన్నిదినాలు వేసితివి? యెంత వెలైనది? నీబుఱంబులో
నన్నిరికించుకొంటివి, కనంబడరాక పెనంగు కట్లతో

మిన్నక మిన్నుసూచుచు భ్రమించెదు నామదికందరాని దే
మున్నదొ? యంతరంగమున నుమ్మలికం బెడలంగఁ జెల్పుమా!

ఎంతటి వెఱ్ఱిమానిసివొ? యేమొ? యిదేమి వృథాప్రయాస? నీ
యంతకు నీవె వేసి వెలయద్దక ఆలును నీవు పస్తుతో
వంతలఁగూరి నాకు బలవంతపు పాపము కట్టిపెట్టినా
వింతగఁగొల్వ దైవమనొ? యేనొక యేలకనో? ప్రధానినో?

వ్యక్తి-
కాలి గులాము కింత యిదిగా సెలవిస్తిరి యేల? నేను కా
వాలిసి మీకుఁగాని వగబారము, పాపము, నెత్తిపైన వె
య్యాలని మన్సులో తలపనైనను లేదు నిజంగ ప్రమాణపూర్తిగా
తేలిక నాల్కెజాతయిన దేవరముందు ఆపద్దమాడ్డునో?

యే దెచ్చే సరిమోపు యెంబడిత నాయిల్లాలు తెస్తాది, తా
నాదా న్నమ్మిన దుడ్డె యిద్దరికి సాలైతాది, యేరేమి క
ర్చేదీ? పిల్లల? జెల్లలా? మిగతమో పేస్తుంట మీకంట, మీ
పాదాల్నాశిగ కడ్పుకాల్చుకొని మేం పస్తుండ మేనాటికీ.

యేమో? యెంటికో? సెక్తికొద్ది తమకే యియ్యాలె యెయ్యా
లనే
నామన్సిప్పుడు నూగులాడుతది; యన్నాల్లాయెనో యెయ్యబ
ట్టే? మా నేందుకు బుద్దిపుట్ట; దిడికంటె నేరమాతాదో? మీ
రేమంటారో? అనే యిదే తెలపకుం డేపిచ్చె నాతప్పి దే.

యేలిక నాల్గు రూకలను యిచ్చి, అవే కలకాల ముంటవా ?
యేలువు మంచి జల్మమున యేసినగాని అదేమినిత్రెమూ ?
కాలము మారిపోయినను కబ్బము సాస్వతమైన దందు కే
యేలువు లేలికల్ కవులకేమిటి కాగుదురంట దేవరా ?

యేలకనా అంటిరి కా
వాలిసి నాబుద్ధిమూడ వాండ్లేదాంట్లో
మేలని ? మీపల్లకి జో
యీలంటని రుజువుచేసెనే మనరాజే.

యేమంత్రీ తమనింటి వక్కపనిగానీ రూకలేగాని గుం
జేమో యెన్నశన బెట్టుకొని పనిచేశే వాణ్ణిగా తోస్తినా ?
నామనస్సెగన సుద్దమైతె తమకైనా అట్లు తోయ్యాలెనా ?
సామీ ? తప్పుకు శిక్షవేసి తమ యిష్టంమీద మన్నిస్తురా ?

పె-

ఆఁ, యేమో అనుకొంటి నిన్మరచి యన్నా! మేలుమేల్ నీవుగా
దా ? యూనాడటు లుగ్గడించినది, స్వాతంబందు నీభావముల్
నీయాకారము జ్ఞప్తివచ్చె సరి ఆ నీకైతపై మక్కువే
నీ యీదాస్యమగుఁ రసజ్ఞుడనినఁ నీవే ఫురిఁ నేటికిఁ.

అన్నా! యెంతటిసేవసేసితివి ? నీయందొక్క సంస్కారమే
యున్నఁ నీసరి పండింతుండు, కవి, వేరొక్కండు లేకుండునేఁగా?

యెన్నాళ్లాయెను నిన్నుఁ జూడవలెనం చే నెంచియున్ జూడలే
కున్నా నిప్పటి కద్ది సంఘటిలె నెంతో సంతసం బయ్యెడిన్.

ముసురున్ మబ్బు దినాలకాలము లవంబున్ గస్తిలేకుండ మా
నసమున్ గష్టాలచిక్కులోఁ దగులకుండన్ జేయు నీసేవ సం
తసమున్ గూరిచె. గాని, దీనివెల యైనన్ వేరుసాయంబు నై
న సుహృద్ధాములతోడఁ గోరి పరమానందంబు నొందింపుమా.

ఇక బదులు పల్కనోరా
డక చేతులు విసిగికొనుచు లజ్జాతి భయా
ప్రకటిత నిజవాంఛాసూ
చకవీక్షణముల నతండు జంకుచునిలువన్.

పె. భా-

మీవాక్యార్థ పరిగ్రహ ప్రతిభ యేమీ! అయ్యయో యింతిగాదే
నా ? వాచ్యంబుగఁ గాకపోయిన సరే వ్యంగ్యప్రధానంబుగా
భావావిష్కరణంబు సేసెనెగదా వాఁ, డేలనో యీగతిన్
వ్యావృత్తిన్ బడ ? బుద్ధిజడ్యజని తోన్మాదంబు నందించెనా ?

తానంతే ననపత్యదోషమున సంతాపించుచున్, సప్తసం
తానాంతర్గతమైన వేవియు నసాధ్యం బంచుఁ జింతించుచున్
క్ష్మానాథున్ గృతిసంతతి ప్రభవ సన్మానప్రభావున్, దదీ
యానూన ప్రియహేతుభూతులరుగా యంచున్ మిమున్
గొల్చెడిన్.

నీకోర్కెన్ సరిగా నెరింగితినిగా నే? ద్దియే నిక్కమౌ
నా? కాదా? చెప్పుమోయి" యన్నసతితో—

పె- వ్యాఖ్యాన సామర్థ్యమున్
నీకబ్బెన్ కవితా పితామహునికిన్ బెండ్లాని వైనందుకున్
గాకేమన్ సరసంబులాడి యతనిన్ గాంచెన్ గృపాపూర్ణతన్.

వ్యక్తి
పిల్లల మన్నుమాట కనిపెట్టడమంటె నిజంగ తల్లికే
చెల్లు మరీ, అదేపనిగ చెప్పినవాటిని తెచ్చిపెట్టడం
నల్లని కన్నతండ్రులది; సాక్ష్యముతో పని లేదు దీని, కో
తల్లీ! సరిగ్గ జెప్పితివి; తండ్రి! యిదొకము పాద్ది కొడుక్కున్.

పె-
అనువానిన్ 'సరినాయనా! మొదలు నీ త్యాగంబు నూహించియే
యనుకొంటిన్, మరి వాక్చమత్కృతి, విధేయత్వంబు, సచ్ఛీలపా
వన వృత్తిన్ కవితాభిమానము, నిటన్ బ్రత్యక్షమయ్యెన్; జగం
బున నీ పేరు స్థిరంబు సేయవలె నేమో మాకు విన్పింపుమా!

వ్య-
పేరు గువ్వలచెన్న డంటారు సామి
తమరికి దయొచ్చినట్టు చేస్తారుగాని,
అయితె నాసేవ చాతనైనంతవరకు
ఒప్పుకోవాలె మీదయ తప్పకుండ.

## 3.

మంగళాంధ్ర కర్ణాట సామ్రాజ్యరమలు
హాసుమీరఁగఁ దీరువిహారసీమ
మానవాతీత మహిమలతో ననల్ప
శిల్పకల్పనలకు నద్రిశిఖరసీమ.

ప్రథిత నవరత్న బహుళ సంపల్లలామ
లనదశేషసల్లలిత కళాభిరామ
కవులపాలిటి కల్పవృక్షముల సీమ
మాన నీయాంధ్రభోజు నాస్థానసీమ.

రవలకల్కి తురాయి రంగులతలపాగ
మేలుతో ముత్యాలజూలుతోడ,
సొంపారు మోమున సోగకన్గవవిలా
సములతో కోరమీసములతోడ
నాడెంపు జిలుగు కర్ణాట ఫక్కిగ వేష
రచనతో మణిహారరచనతోడ,
ఆజాను ఘన బాహు వాస్ఫుర ద్రూపసం
పత్తితో నిడువాలుఁ గత్తితోడ,

తలలు తిరిగినవైరి వీరుల శిరముల
వంచుశక్తితో బ్రాహ్మణభక్తితోడ

పెద్దయును గూర్మితో కీర్తిపేర్మిఁ గోడ
రాయ లొకదినమునఁ గొల్వు సేయుచుండె.

రాజరత్నసింహాసనాగ్రస్థలిఁ గవి
పండితావళి నిర్ణీతభద్రపీఠి
కా మహావేది నున్నతాగ్రాసనమును
లలితగతి పెద్దనార్యుఁడలంకరించె.

దానికెట్టయెదుటఁ గించిదూనశోభ
మైన పీఠముపైఁ గాకమానిరాయఁ
డతుల పాండిత్యజనిత గర్వాంకురములు
మొరయఁ గూర్చుండె స్తంభము నొరసి కొనుచు.

తక్కుదిగ్గజంబులు పండిత ప్రవరులు
చేరి తమతమ చోట్ల నాసీను లైరి
నాటికేలకో యొక్క తెనాలి దిట్ట
దుడుకు వాకవి మొగ మగుపడదుగాని.

కాలిగండ పెండేరము ఘల్లురనగ
లేచి నిలుచుండి సభఁబాఱచూచి యల్ల
సానికవి తన తెల్ల మీసాలనుండి
ప్రభలు గురియఁగఁ బల్క నుపక్రమించె.

ఓ మహాజనులార! నిస్సీమపాండి
తీసహిత కళా కవితా ద్వితీయగరిమ

వెలుగు మనపాలి యేలిక ప్రేమమయుఁడు
విశ్వమున 'నభూతేనభవిష్యతి' గద!

కొమ్ములుగల విద్వాంసులకును కొరుకుడు
పడనిజటిలమైన కవితాపాటవమున
మించు శాస్త్రవాదాలతో మేళవించి
దీర్చి రతనాలకబ్బముల్ గూర్చినాడు.

తనదు కీరితి ఆచంద్ర తారకముగ
మహిత సుప్రసిద్ధాంధ్ర వాఙ్మయమునందు
రంజిలఁగ కవితాసువర్ణాక్షరముల
కృతులఁ జెక్కించి నగిషీ చేయించినాఁడు.

ఎలమి నల్లికజిగిబిగి సేపుమీరి
ముద్దుపలుకుల ముద్దులు మూటగట్టి
యొసగు దివ్యసత్కృతులు వ్రాయించి, కృతిప
తిత్వ సత్సంతతిశ్రీల దేలినాఁడు.

వత్సరము వత్సరము వసంతోత్సవములు
జరిపి సంగీతసాహిత్య శాస్త్రసుకవి
తావినోదాలఁ గల్పించి, కోవిదాళి,
నెంచి సత్కరించి బహూకరించినాఁడు.

ఇట్టి వైదగ్ధ్యసుకవితా పట్టభద్రుఁ
డిట్టి కవిపండితావళి పట్టుగొమ్మ

ఇట్టి సత్కావ్యకృతిపతి యేలుబడిని
నిలువఁగలుగుట గర్వించవలయు మనము.

రాజ త్పండిత సుకవి మ
హాజన సభ సమ్మతముగ నాయీ విద్వ
ద్రాజ శిఖామణి నేడుగ
పూజితుఁడగుఁగాక 'ఆంధ్రభోజుఁ' డటంచున్.

ఇంత సేపును వింజ మూకిడిన కరణి
నున్న సభ ప్రహర్షోత్కర్ష మిన్నుముట్ట
జయజయ ధ్వనులను కరశబ్దములను
కదలి పున్నమ నుప్పొంగుకరణి నొప్పె.

కలకలము కొంచె మాగి యాగకయమున్న
మూర్తికవి తనడాంబిక స్ఫూర్తిమెరయ
నిలిచి పసిఁడి సింహ తలాటములు ధ్వనింప
చేయి మీఁదికెత్తి యుపన్యసింపఁదొడఁగె.

"శ్రీ త్రిలింగాంధ్ర సంస్కృతాశేష వాఙ్మ
యావిరత వినోద, సుకవి కోవి దప్ర
మోద నిత్యసంపాదక భువన విజయ
సంసదార్జిత ఘనసద్యశః ప్రకాశ.

అటులు కటకము, నిటులు కన్యాకుమారి
వరకు విస్తృతంబైన భూవలయమందు

మూరు రాయర గండనా ముఖ్యబిరుద
శూరశేఖర ప్రణుత తేజోవిరాజి.

తనదు శక్తులు, ప్రాణాలె ధారపోసి
జీవితానంద సంపాద నావధు లగు
శ్రేష్ఠతర సుసూక్ష్మతర లలితకళలకు
నించుభండారములు క్రుమ్మరించినాఁడు.

తీవ్రతర కళోపాసనా దీక్షబలిమి
జేసి, కఱకు రాలును వెన్నపూసలయ్యె
కరగి నిర్జీవముల్ సరిగమలు పల్కె
నవ్వె నేడిచె నిగిలించె నాట్యమాడె

నాటిగీర్వాణ భోజుని సాటి దాత
యనుట కేమాత్రమును సందియంబులేదు
మీఁదుమిక్కిలి సర్వభాషాదరాభి
మానము విశేష మీకృష్ణమనుజపతికి.

సకలవిధ మానవాతీత శక్తి, రక్తి,
కృష్ణరాయలయందుఁ గేంద్రీకరించె
లలితకళలు సంగీత సారస్వతములు
శ్రీ విజయనగరానఁ గేంద్రీకరించె.

ఎదురైనచోఁ దనమదకరీంద్రము నిల్పి
కేలూత యొసఁగి యెక్కించుకొనియె

తనపేరఁ గృతులందు కొనువేళ పురమేఁగఁ
బల్లకీ తన కేలఁబట్టి యెత్తె
అడిగిన సీమలయందగ్రహారంబు
లరుదైన పసిడిపళ్లెరము లిచ్చె
బిరుదనామంబుల బిలిచి సన్మానించె
గండపెండేరంబు కాలఁ దొడగె.
ఎన్ని తప్పులైన మన్నించి పాలించె,
సభల స్తుతమతులని సంస్తుతించె
కవుల గౌరవముల కవిరాజ కవిసార్వ
భౌములుగ నొనర్చె ప్రాభవముల.

ఈయాంధ్రభోజ బిరుదము
రాయలకున్ దగిన దంచుఁ బ్రజపల్కుటలో
నేయధికము? ఇది యల్పం
బేయని మనమెల్ల సంశయింపగ వలయున్.

ఆంధ్రసారస్వతాభ్యుదయంబు, తత్ప్ర
శస్తి లోకాన నిటు శిలాశాశ్వతముగ
వెలయఁ జేసిన మారాజువలన ముందు
సిగ లేరు రాయలసీమ ఋణము నేరు.

ఇట్టి కృతికర్త, కృతిభర్త ఇంతకుమును
పుట్టి యుండఁడు-ఇప్పుడు పుట్టలేదు

ప్రట్టఁబోఁ డింక మీఁదట గట్టిమాట
మెట్టి యాక్షేపణాలు నుండ విది సవాలు.

అవుర! భక్తి, ఆంధ్ర కవితా పితామహా!
భళిర! నీదు యుక్తి భట్టమూర్తి!
మేటికవితరక్తి మేల్మేలు మమ్మేలు
దివ్యగేయ! కృష్ణదేవరాయ?

జయ కృష్ణదేవరాజా
జయజయ శ్రీ ఆంధ్రభోజ! జయబహుతేజా?
జయ విద్వత్కవిరాజా
జయజయ సత్కృతి విరాజ! జయమహారాజా?

అనుచుఁ బాడుచు నాడుచున్మనములం దానందముం జెందున
జనసంఘంబున మధ్యనుండి యొక యుచ్చైర్నాద మేతెంచెఁ
ట్లని "సంతోసమె రాజుగారి బిరుద ప్రాప్తిఁ, సవా లక్షతా
నినదంబే, కవితాభిమాని కలఁడిందే వేరొకం డిట్టిఁడే.

## 4.

సతతము కృష్ణరాయల ప్రశస్తిని గాంచఁగోరి శారదా ప్రస
న్నతఁగని సర్వభూజన మనః ప్రమదావహ మా యశస్సమ
గ్రత వెలయింపఁ జూపె నలరాజు; కళంకిత యేప్రజాళి స
మ్మత మగు? శాశ్వతంబె నడమంత్రపు రాజరికంపు సంపదల్?

భువనవిజయసభఁ బండిత
కవిబృందమునడుమ కృష్ణఘనరాయనిబో
లివియద్రంగమున్ బు
ధవితానమున్ నడుమ శశాంకుఁడు వెలసెన్.

వికసించెఁ గలువ పూవులు
సుకవీంద్రుల నెమ్మొగాల శోభలు పోలెన్
నకనకలాడెన్ దమ్ములు
కుకవి సమూహంబు చింతఁ గూరిన భంగిన్.

మబ్బుతున్కల యేనుగంబారిపైన
నరుగుచున్ గృష్ణరాయల ననుకరింప
నెదురువడిన చకోర కవీంద్రు లలర
నిలిపి కేలూత యొసగుట నేర్చుకొనిరొ

(ఒక పరదేశి విప్రుడును-ప్రచ్ఛన్నరూపధారి తెనాలి రామకృష్ణుడునుచేయు సంభాషణ గుప్తవేషధారి రాయలు వినుచుండును.)

రామ-

అయ్యా! మీ దేదేశం?
బియ్యారికేఁ దమరిరాక యేపని మీందఁ?
నెయ్యము దోపఁగ సెలవిం
డయ్యా! అదియేల ఖిన్నులై తపియింపఁ.

పర-

నా దేశము నా గ్రామము
నేదయినఁ గాని నీక దేటికి? తండ్రీ?
వైదేశికుల విచారము
మీ దేశపురాజె లేక మిన్నకయుండఁ.

రా-

మా రాజును మా రాజ్యము
నేరకయును నింతవరకు నీవలె నెవరే
నీరీతిఁ బేరుపెట్టిన
వారే లేరేమిచూచి పలికితి చెపుమా?

ప-

ఏమంచుఁ జెప్పుకొందును-
మామక దౌర్భాగ్యదశకు మదిదుఃఖింతుఁ

మీ మనుజేంద్రుని కతమున
నామానము నిందుకొల్వ్వనను గోల్పోతిన్.

దేవబ్రాహ్మణ సద్విద్యా
వితరణ కల్పభూజ, మద్దిష్టాపూ
ర్తా విర్భవాయమానుఁడు
నావిని కొండంతయాశ నను బైకొనియెన్.

తడఁబడకుండ నగుంపిత
గడగడ తలక్రిందు చెప్పఁఘుఁన ఘనపాఠిన్
అడు గామడగా వచ్చితి
బడియము విడి కడుపునిండ పిల్లలవాఁడన్.

పరిశుద్ధ శ్రోత్రియుఁడన్
దరిద్రుఁడను దానపాత్రుఁడ నమాయకుఁడన్
కరుణ 'యశోయుజస్య'కు
నర, 'ఏతత్సామగాయ' మనఁ డనుకొంటిన్.

రామ—
లౌకిక విద్యాహీనుఁడ
వైకిలెరుగంగ లేక యుల్లితి వయో!
కాకేమి? లలితకళలకు
భూకాంతుం డొసఁగు నాంధ్రభోజసమాఖ్యన్.

పర-

ఆయాంధ్రభోజబిరుదమె
నాయవమానంబు కారణంబు మహాత్మా!
నీయాన; కవిత కిచ్చును
రాయని నీవంటివాఁడు వ్రాసియొసంగన్.

నావే యీరచనము లని
భావాలంకార యుక్త పద్యము లెల్లన్
నే వల్లించిన రీతిగ
నే వినిపింపం గలిగితి నీనాటి సభన్.

ఈపదజాలము నాదని,
యీపాదము వానిదనియు, నీభావంబుల్
నీపాటివానివాయని,
పోపొమ్మని పైనఁబడిరి పొడిచిరి నన్నున్.

ఏభావ మెట్టు లుండిన
వైభవముల నొసఁగుచుండెఁ బద్యము వినినన్
ఆ భోజరాజు పూర్వము;
మీభూపతి యిచ్చుటుటుడిగె మేలిము లాసెన్.

రామ-

ధరణీ సురోత్తమా! పతి
పరసుండే కాలకర్మ సంయోగమునన్

జరిగినది; నేటి యీనీ
పరాభవమువలనఁ గోపపడి తిట్టకుమా!

వర-
కూడనివనులకుఁ బోవుట
యేడేడు తరాలనుండి యెరుఁగనివంశం
బేడ? నృపాలుని కడ నీ
నాఁడేఁ జెయిసాప దొంగనా? కడ కకటా!

తెన్నాలి రామకృష్ణుం
డున్నాఁడట, నతని నడుగ యుక్తిం జెప్పుఁ
మన్నీని మన్ననలకని
యన్నా రావుణ్యుఁ డిచట నగుపించఁ డయో?

ఏయూరు కూట గాంగ్రో
గాయకులము కవుల మంచుఁ గపటముతో నీ
వే యింద్రుఁడవని, చంద్రుఁడ
వే యనినఁ గాక మాకు నిత్తురె రాజుల్?

అమలము లపౌరుషేయము
లమితానంద ప్రదంబు లగు వేదంబుల్
క్రమపద జటాఘనాంతము
లమృతము లానంగ నబ్బునా? అందరకుఁ.

సకలము సంపన్నంబగు
నిక నొకనికిన్ బిచ్చమడుగు టే లనుకొండం
త కుతూహలమూరెన్, దిం
డికినైన నొసంగఁ డేమని ప్రలాపింతున్.

రామ-
విత్తము, రాజ్యము, భాగ్యా
యత్తము; లవి మనవశంబు లైనవి కావే
చిత్తము వినయ వితరణా
యుత్తముగా నాదరింప టదియే గొప్పౌ.

ఉత్తమకులమున జన్మం
బెత్తుఁడు, కవితాభిమాని, హీనేతరమా
వృత్తిన్ జరించు, వితరణ
కెత్తిన చెయినాఁ గలఁ డొకఁ డిపుడీపురిలో.

నావెంట వత్తువా? సం
భావన యిప్పింతు నొక్క పద్యము చెప్పుదున్
నీవది యొప్పింపగ వలె
నా వర్ణక్రమము నుండి నట్టులె చాలున్.

వర-
ఐవదికద! పునహా స
న్మానమ? యింక బుద్ధి వచ్చినది లేవయ్యా!

నేనొల్ల వాని నెల్లను
నా నెత్తిని ధనము పోసినను చాలఁ బాబూ.

రామ—

కాదయ్యా యప్పటివలెఁ
జాదస్త్రపు బాపఁడా వెనఁగ జనుదెమ్మా!
నా దీఖారము నీతల
కేదియు రాకుండ, ననుచు నిగ్గుకపోయెఁ.

---

(గువ్వల చెన్నని గుడిసె-చెన్నడు, వాని భార్యయు)

భా-

మామా! యేంతికొన్నివి?
ఆ మారాజే అడక్క ఆకడెమిస్తె
నీ మన్నెంబడి తుంటా
నే మోజుగ అడుగు తుంటె యీరాదేమే.

మాలచ్చిగాడె మేల్వా
నాలికి చేపిచ్చె సర్పినా దండకడెం
పాలెరికంతోనే, నీ
వాలే పూసాటు గొచ్చినా యీలేవే?

చె-

పిల్లా! దానిగ్గాదే
యిల్లాలికి సొమ్ము లేంటికే యెరిమొగమా!
యిల్లూ, వాకిలి, మొగుడూ,
సల్లగ తిననీకి వుంటె సాల్లేదేమే.

పడ్సుదన మంత చెల్లిన
గడ్సుదనం యెక్కువైందిగా బేస్! గుడ్డ-
గూడ్నా, సొమ్మూన్నా, సొగూన్నా,
యిడ్సవుగా? నీకవన్ని యింగాయాల్నే?

నిస్సంతులమై పోతిమె ?
పున్నబ్బోయి సుగమంట వుంటాదా ? నా
క్కా-స్నేపన్నా ? పానాల్
బుస్సున కష్టాలు మరచిపోనని వుంటే.

నాపాలి పున్నెమాయని,
ఆపెద్దయ్యకు దయొచ్చి అయన కాయ్నే
ఆపద్యాల్నూలాన్నే
నా పేర్నిలబెట్టి సంతు నాక్కలిగించే.

ఇంగేం కలిగిందిగదా
బంగారం వంటి బిడ్డ, బామా! నీవే
సింగారిస్తానంటా ?
బంగారుకడాన్ని ముద్దుపాపకు పెడ్తాం.

భా-
నీవేందో ? నీ బిడ్డేం
దో ? వాగడ మేమువాదమో ? యిది నీకేం
గావో ? గాశారమొ ? యేం
గావాల్సిన రాతవుందా ? గాని దేవ్డా!

చె-
పోయే అయియేకముదా
నా! యేపాటి సుగాలుగాని యేం సాస్వతమా

తాయా? యివన్ని యెంటో
స్త్రాయా? పేరొకటి తప్ప తలిమా వల్లా.

వుండుండే యెవఁడో వ
స్తుండారే యీ బజార్న వొదరా కూర్కో.
పండితులు మనం నీశం
ముండావాండ్లమని తిట్టి పొయ్యేరు సుమా.

అని చెన్నఁడు నాతనియా
లనుకొనుచుఁ గుడిసెనున్న యవసరమున నొ
క్కన నాచక్కటి కేతెం
చిన విప్రుం డొక్కడిట్లు చదువం దొడఁగెఁ.

"వెలకాంత లెందరైనను
గులకాంతకు సాటిరారు కువలయ మందుఁ,
వెలివిద్య లెన్నియైనను
గులవిద్యకు సాటిగావు గువ్వలచెన్నా"

పదరచనకు, నర్థపుసం
పదకంటెను నూత్నమైన స్వరకల్పనకుఁ
దుదిని దనపేరు వినుటకు
నొదవివయానంద మెడఁద నుప్పొంగించెఁ.

దండాలు సాములోరికి
నిండా దయచేసినారు నిజ్జం నీచం

ముండా వాడని అనుకో
కుండా మాపూరిగుడిసె కొంపకు వస్తే.

దండిగ యీల్యాకున్నా
వుండిందేమైన దాచకుండా యిస్తా
వుండా సంతోసంగా
కోం డింద యటంచు” మ్రొక్కె గురుతర భక్తిన్.

తన కలనాటి కృతిసమ
ర్పణసభఁ దిమ్మరుసు ప్రీతి రంజిల నిప్పిం
చిన మేలిమి బంగరు కం
కణ మావిప్రునకు వేడుకను దెచ్చిచ్చెన్.

నీకైశ్వర్యము కలుగున్
నీకీర్తి దిగంతములకు నిండన్ నిగుడున్
నీకాయువు నారోగ్యము
చేకూరుంగాక యని దీవించె నతఁడున్.

పదియడుగు లతఁడు గడచిన
పిదపన్ దేజో విరాజ సేరాక విప్రుం
డెదురుగఁ జని నిలువంబడి
చదివె నదే పద్యమే సుశ్రావ్యముగన్.

తొలిపాటుని చాదస్తపు
పలుకులకున్ మారి [illegible] పాటవగాత్రో

జ్వాల సున్వన కలనకు ని
చ్చలు చెన్నని మానసంబు సంతస మొందెన్.

నాపున్నెమదేమో గా
నీ పైపై బాగ్గె మబ్బెనే యీయాల్నే
నాపానానికి సొర్గము
లో పైనాల్ సేయగల్గె లోకె మింగా.

ఎక్కడ పుట్టినో? యిలలో
ఎక్కడచస్తానో? పుట్టితేం చస్తేయేం
ఒక్కడు పేరను కున్నే
దిక్కే లేదంటు కుల్లి దిక్కులు చూస్తిన్.

నాజీవం నిల్పిన మా
రాజాపెద్దయ్య కనికరం గల్గంగా
మోజైన సంతు గల్గెన్
యీజల్మము తీర్పలేదు ఋణమాయనకున్.

కడుపున పిల్లలు పుట్టే
అడుగడుగున తండ్రిపేరు అనుకొంటారా?
అడపాదడపా తప్పితె;
గడెక్కు నాపేరు తలస గలిగెన్ సైరా!

ఇంతకు ముందాయన యే
మంతగ గొప్పోడ? నేను అల్లాటప్పా?

యింత వలపక్రమా? యీ
డెంత? దరిద్దరపుయీవి యెంతటి దంటూ.

మనసులో కోపంతో యే
మనకోవా కయ్యవార! అంతో యింతో
మన కల్గినంత లోనే
యెనకాడక సెద్దగల్గి యియ్యాలె గదా?

కద్దా? బంగారుకడా
లిద్దరికీ సరిసమంగ యిత్తామంటే?
ఉద్దర గొచ్చిం దిస్తే
పెద్దా? బంగారు లోనె పెత్తన ముందా?

దొడ్డైంది హయామంతా
వుడ్డాలుడ్డాలు దుడ్డు వుబికించిం దీ
దుడ్డొంటి సొమ్ము నాకీ
గొడ్డైతే యావదాస్తి కొండిస్తాండా.

తనపరశువుఁ గూరిమిచెలు
వన నావిప్రునకు నొసఁగి సాష్టాంగముగాఁ
బ్రణతుండగు గువ్వాల చె
న్ననిఁ గౌగిటనెత్తె బ్రాహ్మణ శ్రేష్ఠుండుఁ.

తొలినుండి సంవిధానము
తిలకించుచు [illegible]వంటి తిరిగాడి శ్రీరా

యలును హఠాత్తుగ ముందర
నిలచెన్ బోయ మిథునంబు నివ్వెఅపడగన్

రాయలు-
ఏమోయి! రామకృష్ణా! సేమమ?
రామ-
శ్రీయాంధ్రభోజ! చిత్తము దేవా!
మీమాట మీరి పురిలో
నే మసలితి, రాజశిక్షకే నర్హుండన్.

రాయలు-
మీపలుకు లెల్లవింటిన్
నాపార పాళ్లెల్ల నరసి నాలోఁ గంటిన్
ఈపాటి దానకర్ణుఁడు
నాపట్టణమందుఁ గల్గెనా? యనుచుంటిన్.

ఈచెన్నని చారిత్రము
నా చెవికిన్ రాదు కృతికినాథుఁ డెటయ్యెన్?
వాచవిగా వినిపింపుము
ప్రాచుర్యము సేయు మన్నప్రభువున కతఁడున్.

ఆమనుచరిత్ర కృతిసభ
లో మాట్లాడిన యదిమొదలుగ సర్వంబున్

భూమీశ్వరాగ్రగణ్యున
కామోదముగాఁగ వినిచె నాద్యంతంబున్.

రాయ-

ధనమేల? రాజ్యమేలా?
వినయవివేకములతోడి వితరణ గలుగన్
అనుమానమేల? నాకం
టెను గుర్వుల చెన్నఁడొక్కఁడే కృతిపతియా.

అని కృష్ణదేవరాయలు
తనకంఠమునం దమూల్యతరహారంబున్
గొను మోయి! సత్కృతిపతీ!
యని చెన్నునికంఠసీమయందు నమర్చెన్.

చెన్న-

అబ్బో! సామీ! నాకొ
ద్దబ్బా! యింతటి మరాద, అలుపున్ని ప్రభూ!
నిబ్బరపు మీద యొగటే
యబ్బిందే సాలింతకంటె అతికముకద్దా?

రామ-

ఇవియెల్ల గాజుపెంకులె
యవు నవి యినరశ్మిసోకినంతనె వెలుఁగున్
భవదీయాచార్యమునకు
సవతేది? విశుద్ధకీర్తి సాంద్ర! నరేంద్రా!

శ్రీ

# సీతమ్మ.

పేరొక్కటైనయంతనె
వేరొక్కటి కాకయున్న విధి యేరికి? నీ
పేరే నాపేరని యూ
రూరక భ్రమ పడుచునుంటి నో సీతమ్మా!

నీపే రప్పటినుండి లోకులమదిన్ నిల్చెన్ జిరస్థాయిగా
నాపుణ్యాత్ముఁడు మంచివాక్కులను వ్రాయుంబట్టి, యీనాటికిన్
నీపేరెత్తిన నట్టివాఁ డయినఁ గన్నీరెట్టఁ గష్టాలకున్
నీ పావిత్ర్యము నుగ్గడించు జననీ! నీవెట్టి పుణ్యాత్మవో!

నిజమే, నేనును వానిఁ గాదనను గానీ సోదరీ! నీవయో
నిజమై పుట్టితి రత్నగర్భవలనన్ దేవ్యంశసంభూత, వ
క్కజమా? కష్టములన్ సహించుటన, సంకల్పంబె యూనేని నీ
రజగర్భాండ భరంబునైన నటు దీర్పంజాల లేకుంటివే?

నీవున్ మానవమాత్రవే యనెడి శ్రేణిన్ జేరుచో నాయుగం
బేవే; రప్పటిదేశ మాపరిసరాలేవేలు, సంఘంబులో
భావాల్వేలు, స్వభావ మానసిక తత్త్వాల్వేలు, శారీరపు
ష్టేవే, రిప్పటినాటి కప్పటికి సాటే లేదెటుఁ జూచినన్.

నాటి యుగాన ధర్మగవి నాలుగుపాదముల౯ జరించుచు౯
బూటకు బూటమేని పరిపుష్ట సుపూర్ణ ఘటోధ్నియై, నిరా
ఘాటముగా సుఖాలఁ బితుక౯ గలిగె౯, పదముల్ క్రమంబుగా
మూటికి రెంటి కొక్కటికిఁ బోవుచు నేటి కపాదయైపడె౯.

నేనీరీతిగఁ బల్కుచుండుటకు నాకేమియు౯ లేదు నీ
పైన౯, నీసరియాఁడుదాన నిటు లప్రత్యక్షమంబైన నీ
తో నేనీగతి వెళ్లఁబోసికొని నాతోరంపు దుఃఖంబు నుం
తైన౯ బాపుకొన౯ దలంచితిని; సుమ్మా! వేరుభావింపకే.

ఉన్నారప్పటికే యరణ్యములయందో దీవులందో కడు౯
భిన్నాచారవిచార జాతిమత సంవేద్యాత్మవేషాలఁ బ్ర
చ్ఛన్నప్రాయులు రాక్షసుల్; కలరిట౯ జాత్యాదుల౯ సామ్యసం
పన్నుల్ కాంతలపాలి రాక్షసులన౯ బ్రత్యక్షరూపంబుల౯.

నీకానాటికి నొక్కరావణుఁడె కాన్పించె౯ వెత౯ గూర్పఁగా
మాకో నేటికి, కన్నవారలు మొదల్ మాపాలికి౯ శత్రువుల్
మాకర్మానికి దాపురించు మగఁడే, మాయత్తయే, మామయే,
మాకౌవారలె, సంఘమే, యిటులనే మాకెందరో రావణుల్.

ప్రేమయె లోకజాలములవృద్ధికిఁ గారణ మంట నిక్కమో
యేమొ వచింపఁజాల; అది యెన్నటిమాటయొ, నేడునిక్కపుం
బ్రేమకుఁ జోటులేద యనిపించును; లోకమునందు తుచ్ఛపుం
కామమె మోహమే ధనమె గట్టిపునాదుల రాజ్యమేలెడి౯.

చేసిన పుణ్యపాపములచేతనె సద్గతి దుర్గతుల్ ధ్రువం
బై సమకూరుచుండఁ దమునట్టులె నేరుగఁబైకిఁ బంపఁగా
నాసుతుఁడే సమర్థుఁడని యాతఁడు లేనిదె కూతులెంద రే
నేసరి? యంచు బిట్టు విలపింతురు సంతతిలేనివారుగా.

కూలుచునున్న పున్నరకకూపమునుండి సముద్ధరింపఁగాఁ
జాలు సుతుండెఁ యాపనికిఁజాలదు బిడ్డ, జరాభరంబునన్
గూలెడి యత్తరిన్ గొడుకె కోడలె చక్కఁగ సేవసేసి పూ
మాలలతోట్లఁ బుష్పకవిమానములందముఁ బంపువారొకో.

నాకపురీకవాట దళన ప్రవణ ప్రకట ప్రభావుఁడ
బ్బో! కడు పూజనీయుఁడని, ఒక్కొడుకో కొడుకో యటంచు,మున్
వేకటి నిల్చి నిక్కమని పించిన యప్పటినుండి గర్భపుం
సీకరణప్రయత్నములు సేయఁగడంగుదు రేమి వెఱ్ఱియో!

పక్షిప్రశ్నలు నోషధీక్రియలు గర్భాల్ గద్దెశాస్త్రాలు వే
లకొల్ చేసి సుతుండు పుట్టు నని యుండన్ మంత్రసానమ్మచే
సాక్షాల్లక్ష్మి యటన్న మాటల నిరుత్సాహానుభావాలు ప్ర
త్యక్షంబయ్యెను మూతిముక్కు విరుపుల్ ప్రారబ్ధముల్ దిట్టుటల్.

తనకున్ బుత్రుల నిమ్ము శత్రువుల కందంజేయు కూతుండ్రనం
చును హవ్యంబుల వేల్చి ప్రార్థనలు హెచ్చున్ జేయువారక్కటా!
మునువారల్ దమతో నికన్ బదితరంబుల్ శాశ్వత బ్రహ్మలో
క నివాసంబున కౌప్రభావయుతమౌ కన్యాళిగర్హించుచున్.

ఒక కడుపందె యిద్దరిని నొక్కవిధానవె తాము గాంచినా
రొక్కా? మరి హెచ్చుకష్టపడినో కొడుకులన్ గనువేళ? నాడిముం
డకు నివియెల్లనేల యనుటా? తగుదుస్తులు మేలివస్తు లీ
యక మముకించ సేయ నగుటా? సవతష్టియు నయ్యాయున్ బలెన్.

ఇది మనసొమ్ముగా దిచట నిల్లడ పెట్టిన దేఃకోసమో
గద? యెటు లెన్నిచేసినను గాని యొకయ్యకు నిట్టు నొప్పఁజె
ప్పఁ దగిన దాడిపిల్ల యను భావనతో విధిలేక సాకునా
ప్పిదముగఁ దల్లిదండ్రు లగుపింతురు మాటెటునంటి కర్మమో.

ఉచితసురూప సత్కుల వయోగుణధుర్యులకే వివాహమన్
రుచిరతరార్థ శాస్త్రము విరుద్ధ సమన్వయ మొప్పఁజేసి, నే
రిచినవిధానఁ గుల్కి కృతకృత్యత నొందెడి వారి చేతనే
ప్రచలిత భాగ్యలా సతులు వంచిత లైరి సహాయ హీనతన్.

పిరా? నిక్కపు తల్లి, తండ్రి, యని యన్పించున్ గదా? మోసిక
న్నారో? బిడ్డలఁ గక్కినారో? దయసుంతైనన్ మదిన్ గల్గదో?
వారిన్ జీవితసౌఖ్యకాంతులనియే భావింపరో? పాపమున్
వేరే గానరొ? ప్రేమబంధములకున్ వేరాధనాశాపరుల్.

కని మురిపెమ్ము ముచ్చటలు గాంచినవారలె ముక్కుపచ్చలా
రని పసికూనలన్ గనికరం బనుమాటయెలేక చంపివే
సినఁ గడుమేలె, యట్టులును జేయఁకయే తగునమ్మ? ధర్మమే
యనీ యొక మూఁడుగాళ్ల ముసలయ్యకు బల్మిగ నంటఁగట్టుటల్.

పరులెవ్వారలు పిల్లనీని యొకనిన్ ద్వ్యాష్టుకిన్ ఫలానాపరం
పరమేనత్త మరంది మన్మఁడని, సంపన్నుండ పత్నీకుఁడై
తిరుగాడన్ గనుచుండు శ్రేష్ఠులని, ప్రీతిన్ భీతి నెల్లేని చ
క్కరబొమ్మన్ దమకూతు నిచ్చి తుదిదుఃఖంబ్రతెందరో భావికై.

నూరెకరాల భూమి మననోటికి వెంటనె యందివచ్చు, చే
జారిన దత్తుచేసికొని సర్వము నన్యులపాలఁ జేర్చు, న
వ్వారికె గూర్చనేమొ భగవంతుఁడు, పిల్ల యదృష్ట మెట్టిదో
నేర మటంచు నప్డు మరణించెడి వానికి నిత్తురెందరో?

వానికి రూపమున్ వయసు వాక్కును పుంస్త్వమె లేకయుండినన్
వానిఁ బరీక్షచేసి తలవంపులు సేయు టదేమి భావ్యమా?
మేనరికంబు మాకులము మీరఁగ రాదని యానకాన మా
కే నరకంబు లేదనుచు నిత్తురు కొందరు వట్టి వేబెకున్.

పదిగా నిచ్చిన మూల్యమంది పసులన్ బట్టిచ్చు చందాన, నె
య్యాదియున్ జూడక యెట్టివానికిని త్రోయన్ జాలియున్నారు, సం
పద లేకుండినఁ బెక్కురుండినను నెవ్వారైనఁ గన్నట్టి కూ
తు దయన్ మాలి విచిత్ర నారకము నందున్ ద్రొబ్బగాఁ జూతురా?

మాపెద్దవ్వ గతించుకాలమునఁ సంబంధంబు పోనీకురా
మాపిచ్చయ్యకు బిడ్డనిమ్మనుచు ప్రేమన్ పల్కుచున్ చేతిలోఁ
జై పెట్టించుకొనెన్; ప్రమాణము యథేచ్ఛన్ మీరనౌనా? మహా
పాపం బంచు నిషిద్ధవర్తనులతో బంధింత్రు మమ్మెందరో.

చిట్టికి మాయనంతరము సేమముగల్గ నొకయ్యచేతిలోఁ
బెట్టి వివాహమున్ గనులవిందుగఁ గాంచినఁ జాలునంచు నే
కట్టడికూళ్ళకైన మముఁ గట్టిడి, యున్నది వాని వాతనే
గొట్టుచు నిట్టనిల్వునకుఁ గూలుతు రున్నతభావి సౌధముల్.

బిడ్డకు నల్లు నిల్లటము పెట్టుకొనం దలపోసి, యాశకుం
బడ్డదరిద్రు నుంచుకొని, భార్యకు నాతరువాత నాస్తిలో
బిడ్డకె సర్వహక్కులుగ 'వీలు' లిఖించిన మాసుఖాలకున్
గొడ్డలిపెట్టుగా బ్రతుకె కోర్టులపాలయి రచ్చకెక్కెడిన్.

సొమ్ముల్ చీరలు కోరినన్ని కలుగున్ జుట్టాలతోఁ గూడనా
నె మ్మోడ్కన్ మగఁడున్నఁ బెండ్లియన నింతే యన్న ప్రాయంబునం
ది మ్మాకోవల కంఠనాళముల కెన్నేఁ ద్రాళ్లు కట్టించి, మో
సమ్మున్ జేయఁగలారు మష్మఁదమయిచ్చున్ ముండమోయింపనై.

అన్యాయ్యంబయి నెత్తిపైఁబడును వ్యాసై శారదాచట్టమం
కన్యాత్వంబు తలంగు పిల్లలకు నిక్కం 'బష్టవర్షాభవే
త్కన్యా' యన్నది శాస్త్రమెట్టులని శంకన్ ఒక్క గానొక్కకుం
తున్యాపానికి నంటఁగట్టిరి భయోక్తుల్ ప్రేలుచున్ ఛాందసుల్.

రట్టడి గట్టివాయిగలరక్కసి, రాగవిహీన యత్తయున్
గట్టడి కూళయా మగఁడొకానొక సాధ్విని ముప్పతిప్పలన్
బెట్టిరి వెళ్లఁగొట్టిరనిపించు, ధనాశకులోఁగి, యాలిపైఁ
బట్టిని రౌరవంబునకుఁ బట్టి యొసంగెడివారు తండ్రులా?

తన యౌపాసన హవ్యవాహనునిలోఁ దన్వాహుతిన్ వేల్వఁగా
వనమా; నుత్తపనాగ్నియందు పడవైవన్ జెల్లునే దీక్షితుల్?
అనుచున్ గొంతున గుట్టువట్టు సమయంబం దెంతకేవిల్చి, బో
రన కల్గింతురు వానితో నుపయమప్రాప్తంబు నేకన్నెకో.

మాదురదృష్టయోగమున మంచివరుండు లభింపకున్నచో
నాదట బ్రహ్మచారిణిగ నై పరసాధన చేయనైన సం
ఘాదర మొందనైతిమిఁగదా? బలవంతపు దుష్టభర్తృసం
పాదననైన కన్నెచెఱ పాపుటయే తలిదండ్రి ధర్మమా?

నీకటు మోసి కన్నజననీ జనకుల్ గల వ్రాఁతలేదు గా
నీ, కొని సాకి పెంచి కరుణించెడు తండ్రియు తల్లియుండ్రి; పో
నీ, కయిఁ బట్టువాఁడొ మది నీవు వరించిన మేటివీరుఁడే
నీకయి వంత గూరు కమనీయుఁడె నీకొదువేమి చెప్పుమా?

చాలుఁబడంతి తాను మనసార వరించి వరింపఁబిడ్డ, భా
వాలయు దైవమే తనసహాయముగా నరుదేర నేయర
ణ్యాలఁ జరించినన్ అలములాకులు మేసిన నెంతవింతక
ష్టాల భరించినన్ మదిఁ గృశాను శిఖాతతి ప్రమందిపోయినన్.

ఇమ్ముగఁ దమ్ముఁగూడి మగ లేహారపొచ్చెము లేని నిండుప్రే
మమ్మున నోలలారిచి, సమస్త సుఖమ్ములు సంఘటింపగాఁ
గమ్మని కాపురమ్ము కలకాలము నెమ్మది నిర్వహించు నా
యమ్మలు నోచునోము లవియుండునె మాయటువంటివారికిన్.

అదె కడులేమితో నవయు నప్పటి కబ్బిన మేలికుందనం
బదె బలుచిక్కులన్ జివికినత్తటి దాఁ దిరుగాడు నందనం
బదె యిల నాడుపుట్టు వయినందుకు పొందెడి సార్థకంబగున్
మదిమది నైక్యభావమున మన్ననసేయుధవుండు గల్గినన్.

అదె తొలిబామునందు మనసారగఁ జేసిన పూజకున్ ఫలం
బదె తలిదండ్రు లప్పు డమలాత్ములఁ గోరిన కోర్కెకిన్ ఫలం
బదె యిలలోని స్వర్గసుఖ మద్దె యనిర్వచనీయ భాగ్యమా,
మదిమది నైక్యభావమున మన్ననసేయు ప్రియుండు గల్గినన్.

వనిత స్వభావసిద్ధ మగు వాక్చతురత్వము, తెల్వితేట, నే
ర్చిన వినయాదులున్, సహనశీలము, సుందరతాశుచిత్వ న
ఘన గుణజాలమున్ అడవిఁగాచిన వెన్నెలయేయగున్ గదా!
మనసు మనస్సునన్ గలిసి మన్ననసేయు విభుండు లేనిచో.

తనువును ముంపనైన కలధౌత సువర్ణ సుభూషణావళుల్
తిని పొరలాడి చల్లిన చలింపని వొధనధాన్యసంపదల్
తనకనుసన్నలన్ మెలఁగు దాసికలున్ చెలులున్న నేమియా?
మనసు మనస్సునన్ గలసి మన్ననసేయు మగండు లేనిచో.

అగణితశాస్త్రవాదములు నార్థికచర్చలు రాజకీయముల్
ద్విగుణిత సాహసక్రియలు విప్లవభావము లుద్యమంబులున్
మగతనముల్ కడింది మహిమల్ ప్రకటించిన వారికంటెదా
మగనిమనస్సు కెక్కఁగల మానినియే సుకృతాత్మురాలగున్.

అగణిత దేవతార్చన లహర్నిశముఁ మడుగుల్ జపంబులుఁ
తెగని వ్రతాలు నోములును నిత్యుపవాసము లొక్క శ్రాద్ధులుఁ
వగకగు యాత్ర లొక్కమొగి వంతుగ సల్పెడి వారికందెదా
మగని మనస్సు మూఁగొను మానినియేకదుధన్యురాలగుఁ.

ఇరువురిదొక్కమాట యయి, యిద్దరికొక్కటియేస్వభావమై,
యిరువురికోర్కె యొక్కటయి, యిద్దరుసేయు ప్రయత్నమొక్కడై
యిరువురి యంతరంగములు, నిద్దరియాత్మలు రెండునొక్కడై
మురిసెడి దంపతుల్ ప్రకృతిపూరుషులే, ధరలో విముక్తులే.

చెన్నుగ నెన్నిజన్మములఁ జేయు తపంబున గాక దక్కునే
హృన్నిలయేశుకుఁ మనసు కెక్కిన సుందరతా సురూపతా
భ్యున్నత భావసామ్యముల నొప్పి మనోభవ భావమార్దవ
స్విన్నకపోల మక్కునను జేర్చి సుఖించెడి తన్మయత్వముల్.

ఫుల్ల మనోంబుజాత పరిపూత వినూత్న మరంద సంపదల్
కొల్ల గొనంగ పొంచు నళికోటుల దాటులు మాసిపోవ రం
జిల్లు నెడందఁ జూఱఁగొనఁ జెల్లదె వల్లభ సుప్రసాద భా
స్వల్లహరీ పరీత సరసప్రసరంబులు ప్రేమచంద్రికల్.

మేధ్యము లౌ మనోగతి సమృద్ధులతోడి ప్రశాంతసిద్ధికా
రాధ్యము నైక్యతా సుఖకరమ్మగు ప్రేమము, తత్సుధారసాం
భోధ్యురువీచి డోలికలఁ బ్రొద్దులు పుచ్చుచు సంతతం బభే
దాధ్యవసాయభావముల నాల్మమగలుండుటె స్వర్గసౌఖ్యమో.

ప్రాతిగఁ గోరి మోసి కడుపారగ ముద్దుగ గాంచి పెంచి, స
త్ప్రీతిగఁ బిల్చి, యల్లునల విష్ణువుగా సుతధారవోయు నా
దాతలఁ బిప్పిచేయు వరదక్షిణ ముందుగ ముట్టకున్న, నా
కూతును బట్టఁబో రకట! గుమ్మడికాయల దానమంచునో.

తనవంశోన్నతి సుప్రతిష్ఠలకు నాధారంబు, సద్ధర్మపా
వనదీక్షావిధి ముక్తికిన్ ప్రథమ సోపానంబు, సత్కర్మసం
పినసైదోడు ద్వితీయు; పెండ్లియనగా వెయ్యేండ్లపై రట్టిదా
నిని బేరంబులు గిట్టుబాటులకునై నీచంబుగాఁ జూతురే?

ఆనైసర్గ్యమటుండ, వైషయికసూ నానంద సంప్రాప్తికిన్
దా నర్థాంగియె గాదె? సౌఖ్యవిలసత్సారాపథ స్వైరతా
యా నేర్చున్ దనకొక్క రెక్కయెగదా? యన్నింటికిన్ దోడుగా
దా నాలింగొన నేటికోమరి ధనోత్కర్షంబుగా దక్షిణల్.

వెలకై యాలగుదానిపై బొడము నాప్రేమంబు సద్గ్రాహ్యమే?
వెలతో హెచ్చుచుఁ దగ్గునన్ దుదకు పృథ్విన్ దప్పి తార్స్యారగున్
వెలకాసించి వివాహమైన మగనిన్ ప్రేమించుటో? కొంటయో?
వలవం బడ్డ ఘనంబొ? కాక విలువం బిడ్డన్ ఘనంబో? మగల్.

చదువుల్ నేర్చుచు పాఠశాలల కళాశాలాదులన్ రచ్చలన్
వదరుం బోతులవోలె 'స్త్రీలయెడ సన్మానంబు'పై బుద్ధి సం
పద నేర్పన్ వెలయించునాయువకు లుద్వాహంబులందున్ బదిం
బదిగా నీవరదక్షిణల్ గొనుట మానన్ జాలరేయయ్యయో?

చదువ౯ పేరునఁ బట్టముల్ బడయవగా సంసారము౯ ఆస్తియు౯
దుద ముట్టించిన ప్రాజ్ఞు లాపయిని వంతు౯ బూని పెండ్లిండ్లతో
ది పూరింపఁ దలంచిరేమొ? యిదియు౯ వ్యాపారమంచెంచిరో?
యిదియేనో తమ నేర్చుకొన్నది? రవంతేఁ గన్నుల౯ విప్పరో?

కడుపునఁబుట్టు కూతురినిఁ గన్నియగా నిలఁబెట్టలేక, యే
వడువున దుడ్డుగూర్చెడి యుపాయము గానక, యున్న కాస్తదుఁ
దుడుకుగ నప్పుకాయకముతో వరదక్షిణ కట్నమిచ్చి గ్రు
క్కెడు కనునీరు గార్చెడి యకించనుపాలిటి దాత లల్లురే.

పోనీ, యెంత వెలైనఁబోసి కొనిరేపో, యంతతోఁ దీరెనా
యానందంబగుఁ దల్లిదండ్రులకు; కాదా నాఁటితో, ప్రస్తుతం
బా నాకేమి యొసంగు దంచురగడే, యత్తింటికి౯ బంపుచో
తానేమిచ్చె నటంచు దెప్పుటయె నిత్యంబల్లుతోఁ బీడయే.

మనసా కోరినవాఁడు వేలముల నమ్మంజిక్కె పోటీలతోఁ
దనతండ్రుల్ కడుపేదలో కలిగియు౯ దౌర్భాగ్యులీతాకులో
జనులా? పిల్లకు నడ్డితీరెనని చూచాయల్ వదంతుల్ విచా
రణలు౯ జేయుదు రింక దిక్కెవరు? నిర్భాగ్యంపు కన్యాళికి౯.

కన్నియ యందచందములఁ గానరు, విద్య వివేకబుద్ధుల౯
మన్ననసేయ, రొండొరుల మక్కువ కోర్కులు మీనుపట్టుమేక్
ప్రసన్నదనంబు సూడరు, తలంపరు వంశము సంప్రదాయము౯
తన్నకపోవ నెంత్రు వరదక్షిణలే మగబిడ్డ తండ్రులు౯.

ఆమగబిడ్డఁ గన్నసుకృతాత్ములె లచ్చిని బూజచేసినా
రా? మరి యన్లైనోచుకొనరా? తొలి కూఁతులఁగన్నవారలా
రా? మగ చిహ్నముల్ గలుగు నన్నలె వేలుపుఁజెట్టు మొక్కలై
రా? మఱు చిల్కఁబోల్ సొగసురాసులు కన్నెలు పుట్టగొడ్డులా?

కొరవడు మానవత్వమునకున్ బరిపూరణచేయుపూర్ణమా?
భరమగు దారపోషణముపట్ల నశక్తతకై సహాయమా?
అరయక యాఁడుబిడ్డఁ గనినందులకై ధనరూప దండమా?
మరి యిది తెల్వి లేనితనమా? వరదక్షిణకొంట లిచ్చుటల్.

ప్రాజాపత్యాదులలో
నేఁజాతికిఁ జేర్పఁదగునో? యీపెండ్లిండ్లన్?
సాజాత్యమున్న నేమగు?
వైజాత్యము గూర్పఁజాలు వరదక్షిణలే.

ఊరక బొట్టుకట్టుకొనిరో? తమకయ్యదియే విలాసమో?
కోరి పరమ్మపిల్లలను గుత్తుకకోయుటకే జనించిరో?
వారికి నచ్చవచ్చు రతిప్రౌఢి యెరుంగని ముద్దులంచునో?
దూరమునుండి నైన నటు తొంగియుఁ జూడరు భర్తలేలొకో?

ఉప్పుం గారము తిన్నదేహములు గావో? యెప్పుడేనాఁడువా
రప్పూపవింటిని గెల్వఁగా సబలలో? యాచారకాండంబులో
తప్పుల్ కొలులు హంసపాదులును దిద్దంరావో? తామే మహా
నిప్పుం బోలిరొ? యంటరానిజనులో? నిక్కచ్చిగా నుందురో?

చీకటికాల మింటనె వసింపుఁడు నేటికి; నొంటినుండగా
నాకుభయం బటంచుఁ గరుణంబుగ వేడిన బుద్ధిలేని ముం
డా! కొరడాలఁ గొట్టినను నావిషయాలకు వత్తువేల? థూ
పోకిరి! యంచు మామగలు పోదురు ముద్దులవేశ్య లిండ్లకున్.

దండి గుణాలకున్ గని, యథార్థప్రేమకుఁ బుట్టినిల్లు, స
త్పాండితిగల్గు ధీనిలయ, వట్టి యమాయకురాలు, పుస్తెయుం
బెండిలిలేక పేరునకు వేశ్యయెగాని పతివ్రతాశిరో
మండన మండ్రుబల్ తగులుమై మటుమాయలమారిముండలన్.

తానయి తెచ్చిపెట్టుమని దానికి దీనికి పోరుపెట్టునో
నేనయి నేనయిచ్చిననె; నీవలె నన్నుఁ దృణీకరించునా?
ఏనగవేది? యేడ్పుమొగమే నడపీనుగ! బుద్ధితెచ్చుకో
దానిని జూచియైన నని దండన సేయుచు మమ్ము నిత్యమున్.

రసికత్వంబున గౌరవంబు తనరారన్ వేశ్యకూటంబుపై
కుసిత్తోఁ దాతలనాటిక్షేత్రములు పెక్కుంబోవ, పుట్టింటమా
పసుపుంగుంకుమ కిచ్చియున్న పొలమో బంగారమో వ్రాసియీ
పొసగింపన్ దమపేరఁ జేయుటకు నెప్డున్ ముష్టియుద్ధంబులే.

తన కనురక్త, రూపసి, యుదారగుణాఢ్య, సుశీల, నిండుజ
వ్వని, యగుభార్య నింటఁ బలుబాములఁ బెట్టునకించనుండు నె
ట్టన వెలయాలి నుంచుకొనుటా? తన యాలిని తన్పులేక యా
తనపడు షండుఁడున్ బరుల దారల శీలము కొల్లగొట్టుటా?

దాస్యముతోనె తృప్తిపడి తన్వుగ ఫున్నమకో మరేయమా
వాస్యకో తప్పిదారి యొకపాటిగ నేడిచినంత వారకాం
తాస్వద సత్ప్రసాదభరితంబుగ జర్జరి తాంగ దుస్థితిన్
హాస్యముపాలు కావలసినట్టివె మాకగు భర్తృసౌఖ్యముల్.

ధనమారోగ్యధనమ్ము కీర్తిధనముం దారుణ్యరేఖాధనం
బను వై పొంపిరిపోవు ప్రాయమును వేశ్యాదేవతారాధనా
ర్పణ సర్వస్వనివేదనా నియతి తీర్పన్ బుచ్చి యామీఁదటన్
గానప్రాణంబున ధర్మపత్ని దరియున్ శుశ్రూషలన్ సైకొనన్.

కృత్యాకృత్యవివేకహీన నిజభర్తృప్రీణనైక వ్రతల్
నిత్యైకాదశిదీక్ష నిత్య శివరాత్రి ప్రక్రియల్ బూనగా
నత్యంతేంద్రియ తుచ్ఛభోగముల స్వేచ్ఛాహార పానాదిసాం
గత్యంబుల్ పచరించి రోవెలదికిన్ గైంకర్యముల్ సేతురా ?

ఇంపులు గుల్కు పల్కు కొసరింపుల నాన్నయటంచుఁ జేర వా
రింపుల కన్నుబున్ను కసరింపుల నెప్పుడు నీసడించుచే
యుంపుడుకత్తె పంచపడి యుండిన ముక్కిడి కుంటికుక్కపై
పెంపుడు తొత్తుకూతుపయి ప్రీతియు చూపక యింటిబిడ్డలన్.

తెన్నులు రూపుమాపి చెడుతెన్నులఁ జక్కని రాచబాటగాఁ
బన్నిన తెల్వి లేమియను బల్ విపరీతపుఁ జిమ్మచీకటిన్
గన్నుల తోడి యంధులగు కాంతులనే ధ్రువతారగా మదిన్
మన్ననసేయుచున్ మెలగు మాగతి యేగతిఁ దెల్లవారునో?

ప్రాకులువారు కోర్కెఁ దలప్రాణము తోకకువచ్చి, పైపయిన్
దూకెడి శీలచోరకుల దుండగమాపగ నూపిరుగ్గి యే
సాకును నాథుకాల్నిలుపఁజాలక వమ్మయిపోవఁ గోడికిన్
మూకను దెల్లవారిన తమస్విను లెన్నగతించి పోయెనో?

రతి కేనాటికి స్థాయిభావ పరిపూర్ణత్వంబె లేకున్న, సం
తత మాత్మవ్యభిచారి భావము లవస్థాప్రాప్తి కల్పింప, ను
ద్ధృత బీభత్సభయానకంబులును మైత్రిన్ బొంది తత్సాధకా
కృతి దాల్పన్ సరసంబెటా? విరసమే యెందున్ రసాభాసమే.

ధీరత కోశకోశమునఁ దేలదు దీపము పట్టి చూచినన్
క్రూరతకాక యెట్టు లనుకూలత కల్గు? విటాగ్రగణ్యుల
న్యారతి పీఠమర్దకులునై ప్రకటింతురు ఘోరదండనే
చ్ఛారతి నాత్మనాయకులు సంతత దక్షిణనాయకత్వమే.

స్త్రీలు విశుద్ధశీలములఁ దేజరిలన్ వలె నన్నవారె, పెం
డ్లాల మహాపతివ్రతలనన్ సరిదిద్దు మహానుభావులె
ఆలులి బోలుప్రేమ వెలయాండ్ర గృహంబులగస్తువారలై
తాలు సుఖాలు గ్రోలు పరదార రహస్యవిటాగ్రణుల్ చుమీ!

చెడుచెడుకూతలే, దుడుకుచేతలె, యింటనె మామగారి యుం
పుడు పగలాడితోడి తడిబూతులె, కోతలె, పాడురోతలే,
బుడబుడ ప్రక్కయిండ్లపువుబోండ్లకుఁ జారులె, మాటమీరుక్ష,
మిడుకుదుమా? మనోవిభుల మేలని నెత్తిని బెట్టుకొందుమా!

తానెటు మాలముండల జతఁ జనుచుండిన తప్పులేద, యే
దే ననుమానభూతముగ నించుక వాసన దాకెనేని పెం
డ్లానికి నాడె మూఁకును యథార్థ విచారణ చేసి మాడఁడ
మ్మానిని పూర్వ శీలమును, మాదిగయింటికి కోయఁ బెట్ట

ఎన్నక పాలికిన్ బడినదే పరమాన్నముగాఁ దలంచుచున్
మిన్నక కండ్లుమూసికొని మేదకవృత్తిఁ జరించుచుండినన్
దిన్నని పూరిపుల్లకుఁ గనీసముగా మగవారికాం, డ్రిఁకే
మన్ననమాటలేల? యవమానప్రసంగమె తిట్లుకొట్లయా.

కట్టడచేసి నిల్పుట, కఘంబని భీతిగఁ జెప్పు నీతి, కే
యొట్టులకున్ గమున్ మనసు కూరటఁ బాసిన దిట్టవాసతుల్
తిట్టుటకున్, మరే పారక దెబ్బలకున్ మతిరాని యీమగల్
పట్టిన పెన్పిశాచములు ప్రాజ్ఞతగల్గు వధూటికోటికిన్.

కోతికినైన నీతికలుగున్ మగజాతికి లేద, యెంతకున్
బ్రాతిగ నాతికే మొగము వాచిరొ? యెందును మా ప్రసంగమే
వాతికిరాని బూతులె ప్రబంధ విమర్శలె వెక్కిరింపులే
గీతికలే తలంకరపకీర్తికి నార్తికి పాపభీతికిన్.

ఇంటికి నొంటిరాఁగలుగు, సేపని వారలో, పాకివారొ, పే
రంటము పిల్వవచ్చెడి పురంధ్రులో, పాల్పెరుగమ్ము వారలో,
బంటుల ముద్దుపెండ్లములో, ప్రాయపు టన్నులమిన్న లెవ్వ రేఁ
గంటఁ బడంగరాదు వెటకారపు చూపులె సొట్టకూతలే.

అనవసరంబు జాతి, మత మక్కరలేదు, గుణంబు, ప్రేమవా
సన, కులకట్టు, వావివరుసల్, విభవాదుల తారతమ్యముల్
చనవులు వద్దు, లేవయసు చక్కనిచుక్కలు కర్మజాలకే
కనఁబడినంత పాల్పడుచు కామవికార విరుద్ధవృత్తికిన్

ఊరక గోడుపోసికొను చుంటయె చంచలలంచు నేమియున్
నేరని యాడువారిపయి నేర్చిరిపో మగధీరు లెంతయున్
వారును వీర లిద్దరును భాగము గూడక సాగదేకదా ?
యేరిది తప్పు ? ముందగుట నెక్కువ యామగువారి దేసుమీ.

ఇష్టములేనికాంత రమియించుటదే రసికత్వమో మన
స్తుష్టియొ, రాక్షసత్వము పశుత్వముకన్న నికృష్టమైన దీ
భ్రష్టత, నిస్సహాయదశఁ బైఁబడ రేగి పెనంగుచున్న స్వా
భీష్టము తీర్చుకొందు రలివేణుల చేతులుకాళ్లు కట్టియున్.

ఎంతపిశాచవర్తను లిసీ! యొడలారని యొంతపచ్చి బా
లెంతల గాసిపెట్టి కుమిలింపగ, వేకటిప్రేగుదూగు సీ
మంతినిఁ గూల్పనేఁ, జెఱఁగుమాసిన మానినిఁగూడి, ఆమయ
క్రాంతలఁ బొంది, నాశమును గాంచుటకేనిఁ దలంకరక్కటా!

తీపులు పల్కులున్ మనసుతీరు విసంబని యాడువారి న
క్కా! పనిలేని మంగలులుగా సరిపోవు కుయుక్తు లెన్నియో
తోఁపఁగ వ్రాసి పెట్టుకొనుతుంటరులా మగవారి నమ్మనౌ
నా! పరదార విత్త హరణంబుననే కద పండితోత్తముల్.

స్వార్థము జీవితంబున రవ తయుఁ ద్యాగము సేయలేకయే
వ్యర్థపు వ్రాతలన్ పరుల వంచనసేయఁగనే "పరోపకా
రార్థ మిదం శరీర"మని వ్రాసిన వ్రాతకు వ్యాప్తిఁగూర్చుచున్
సార్థక భావసిద్ధి గల యట్లొనరించిన దాడువార్థలే

'పాపమగున్ పతివ్రతలపాల దురంతము సేయఁబోకుఁ డీ
పాపినె యిచ్చవచ్చినటు శాపములఁ బెట్టుడు మీదుపుణ్యమం
చోపెద'నా జవాబులివి ఊఁసరి; నాకొడ వెల్లఁగంబ్లుగా
శాపము కల్గనిమ్ము పిలుచన్ నిను శీల పరీక్ష చేయగా,

అసిధారావ్రతచర్యగా బ్రతుకు నిల్లాండ్రన్ విదారించి, బల్
విసువున్ జెందినవారి యగ్గమగు నుద్రేకాగ్ని కీలావళిన్
మసి గాకుండఁగ రక్షచేసినది మామాంగల్యపుంజల్వమే
పసుపుం గుంకుము కల్మికే దనిసి సంపాదించు మాశాంత మీ.

మీ యింటాయనకేమి బుద్ధిచెడెనా ? మేస్త్రీలు పక్కింటిలో
ప్రాయంపున్ మగనాండ్రు నుండుటయె తప్పా? సానివాడాయెనే
పో యింకైనను బుద్ధిచెప్పఁగలవో? మోమోటమో? యేమియా
నో యూహింపు మటన్నవారి నెటులే నోదార్తుమా? యేస్తమం.

మగువన్ గూడి రమింప నేవిధివిరామంబుల్ నిషేధంబులున్,
మగనాండ్రన్ జెఱపంగఁ దేకువయు నాసల్ వంశ మర్యాదలున్
పగయున్, ప్రాణము తీపియున్ గనరుగా ప్రాయంపు గుజ్జిల్, సురా
పగయున్ బంకిలమౌను వారల మహాపాపంపు వారాసులన్.

మానసమందుఁ దావొసఁగి మానముపోవఁగఁ గట్టుకొన్న నే
రానికిఁ జుట్టుకొన్నదని రౌరవయాతన లోర్చుకొన్న పా
పానికిఁ దోడిజాతికి నపాయము గూర్చెడి తార్పుగత్తెలై
మానిను లెంద రేగతుల మ్రగ్గిరో లోన మనోవ్యథాగ్నికిన్ ?

మగఁడిట్లాయె నటంచుఁ జెప్పికొనగా మామానమేపోవునే
నగుబాట్లేయని కప్పిపుచ్చి తగువిన్నాణంబుతో నేరుగా
దిగజారెన్ దివినుండి నేలకని నెత్తిన్ బెట్టుకొన్నందుకీ
యగచాట్లున్ బలుతిట్లుకొట్లు తుది దిక్కై బావులో చెర్వులో.

పరిగెల నేరుకోవలెనె ? పంటపొలాలను జోకచేసినో
నెరుగని వెఱ్ఱికాపు, మతిహీనత నేటికిఁ బ్రాకులాడగా
వరుదగు పంచభక్ష్య పరమాన్నము లింటనె యారగింపకే
తిరిపెపు దొంగ కూళ్లకును తిప్పలపాళ్లకు పూటకూళ్లకున్.

పసుపుం గొమ్మును గూర్చి కట్టుకొని మాపైసొమ్ములన్ బుస్తెతో
దుసి యిమ్మన్నదె యాజ్ఞగా వెనుక ముందుల్ చూడకందీయ, దు
ర్వ్యసనాసక్తిని బాడుచేసికొని స్వప్రాణాంతకప్రాప్తి, మా
పసుపుం గుంకుము కల్మియైన వహియింపన్ జాలనీ రయ్యహో.

అంతులులేని సీత దమయంతులు కావలె నొక్కరొక్కరే
యింతులు నంచునే పలవరించుచుఁ దాము జయంతకంతులై
గొంతులఁ గొల్లగొట్టుటకు గొంతెమకోర్కు లవేల ? నెమ్మదిన్
రంతులు మాని కావలదె రాముఁడుగా నలచక్రవర్తిగా.

లోకులదృష్టిలో మగఁడు లోకువ గాంచిన యింతి యత్తకున్
లోకువె, బావమామలకు లోకువె, యేసరిసాటి వారికిన్
లోకువె, తల్లిదండ్రులకు లోకువె, యన్నలకక్కగారికిన్
లోకువె, పైనిదేవునకు లోకువె, తాఁదనకైన లోకువే.

సతి యెవ్వానిని గోరకుండినను నే చండాలుఁడో యామెకై
మతి నూహించు జెఱింగి నంతటన నిర్మాల్యత్వదోషంబు నా
మెతలన్ మోపఁగఁజాలువార లెటు తమ్మేవేల్పుగా నమ్ము నా
క్కాత కేవేళఁ బరానురక్తు లుపభుక్తుల్ దాము సంపూజ్యులో.

నాకున్ మంచిదిగా దటంచుఁ దెలియున్ గానీ విసర్జింప నే
మో కాకున్నది, నీప్రబోధ మఖిలంబున్ వ్యర్థమే మానునో
లేకున్నన్ సరి నీవునావలెనె యెట్లేఁ బొమ్ము నాసమ్మతం
బే కోపింప నటంద్రు కొంద రవురా యెంతో యుదారాశయుల.

వనటల్ గూరిచినన్ సహించి మనసావాచా యనన్యప్రప
త్తి నతితం బగు సౌమనస్యమునఁ బాతివ్రత్య దీక్షావిధిన్
మనుపన్ దగ్గఱనీవు మమ్ముఁ దమకై మా కంపుతో వియ్యమం
దిన బీడీ సిగరేటు నస్యముల బ్రాందీబుడ్ల దుర్వాసనల్.

లలితానామ సహస్రకీర్తనములున్ లక్షోపలక్షాది ని
చ్చలు శ్రీపంచదశాక్షరీజపము శ్రీచక్రార్చనల్ చేసినన్
ఫలితం బబ్బునె? యింట భార్యలను దిప్పల్వెట్టి లోకంబులో
లలనాసంఘము గోడుపోసికొనుచుండన్ వేడబంబే యగున్.

ప్రొద్దస్తం బిలుదీర్చనే, దినదినంబున్ వండనే వార్చనే
మొద్దున్ బోలిన మోటుజాతి పలుకే, మోమోటపుం గూటమే,
పద్దుల్ పద్దులు కాన్పువేకటులె, యాపైఁ బిల్లజంజాటమే
వ ద్దీయా లని భోగినీరతిమతిన్ వాంఛింతు రౌరా! మగల్.

తనదుసురూప సంపదకుఁ దాఁగడియించిన గొప్పయాస్తికిన్
తనదు శరీర సౌష్ఠవ విధంబునకున్ బటుధైర్యశక్తికిన్
తన రసికత్వపుంబసకుఁ దన్పుగ నొక్కతె చాలదంచు నా
తన రుచిరాంగులన్ విధిహితంబని పెండిలి యాము రెండనో.

బాండ్రాయిన్ బలెఁ గట్టుకొన్న భరణంపుంబాలి యాలిన్ గదున్
గొడ్రాల్ ధూర్త యటంచు సొమ్ములును సాకుల్ చెప్పికొంచున్ మనో
రుద్రోగుల్ మరి పెండ్లియై సవతిపోరుల్ పెట్టి వాడింత్రు పో
ద్విడ్రూపంబుల నిస్సపత్నమగు మాప్రేమాలతాంకూరముల్.

ప్రాయము జారి యైదవ వివాహమునన్ మెడఁగట్టుకొన్నయా
తోయలి నిండు జవ్వనముతో మదిలోఁ గిలి హెచ్చఁగాఁ బశు
ప్రాయులు వారి శీలములరక్షణ పేరిటిరిమ్మ పుట్టి య
బ్బా! యమయాతనల్ పడుచు నయ్యవి గూర్తురు తోడివారికిన్.

తానా కాటికిఁ గాళ్లుచాచు బడుగుం దాతయ్య వేదోక్త క
ర్మానుష్ఠానము చట్టుబండ లయి పోరాదంచుఁ బెండ్లాడునే
గానీ నాటివయస్సునన్ దనకు మోకాటెత్తు లేబొట్టె నె
ట్లానంగ ప్రబల ప్రఘాత పరిరక్షన్ జేయ నూహించునో.

తా వాత్స్యాయన సూత్రముల్, తరుణి గీతా బ్రహ్మసూత్రాలు, స
ద్యోవృష్యౌషధ సేవ తాను, నవలా యుప్పిళ్లుపాసాలు, వే
శ్యావేశ్మంబుల త్రోవ తాను, సతిదేవాగార మార్గంబులా ?
ఈవైజాత్య విరుద్ధ వర్తనము లెందే మానుషంబౌనొకో ?

'తాతా! పెండిలి చేసికోఁదా'? యనినంతన్ 'పెండ్లినాకేల' యన్
కూతేరా దెవరిత్రు పిల్లనని సంకోచించు; పుంజాతి స్త్రీ
జాతిన్ బెల్లపుటుండఁబోలెఁ దమయిచ్ఛన్ జప్పరింపంగనౌ
ప్రాతిన్ బాయదు సర్వకాలముల సర్వావస్థలన్ భూస్థలిన్.

ప్రాయపుటింతి నే యయినవారలు ప్రీతిగఁ బల్కరించినన్
నాయనగారి క్షేమము వినన్ గుతుకంబున తానె యడ్గినన్
ఏయనుగున్ సహోదరులనే నటు లొంటిగఁ గూడి నిల్వఁ జూ
చాయగ విన్నవృద్ధపతి చండత మండిపడున్ గడున్ గడున్.

ఆయజ్ఞంబుల రంభ కౌగిళులకై యాశించి కాదే 'అహ
ల్యాయైజార' యనన్ బ్రసిద్ధిగను స్వర్గాధీశు మెప్పించువా
గేయజ్వల్ ? యజనాధికారమునకై వృద్ధాప్యమందైన శా
స్త్రీయం బేయని ముగ్ధబాలల మెడన్ ఛేదింప నుద్యుక్తులై.

మాతృసమాన లత్తలును మామరదండ్రును క్రొత్తకోడలే
చేతికిఁ జిక్కెనా తమకసిన్ బరిపూర్తిగఁ దీర్చుకొంట కే
మో తమవాఁడు సుద్దమని ఓసి! యమాయకుఁడైనవాని కే
రీతిగ వచ్చె, నం చలపరింతురు నేరని నంగనాచులై

మాటకుముం దదేపనిగ మాతలిదండ్రుల దెప్పిపొడ్పూటే
పూటకుఁ గొట్టి తిట్టుటయె భోజన మా ననిపించు, గోడలిన్
గోటికి నేటికిన్ పసులరొచ్చుకు గోటను మీటి చీటికిన్
మాటికి నత్తయే పనవు మాతలపై మిరియాలు నూరుచున్.

వంగిన, లేచినన్, బనులు పాటలు చేసినఁ, జేయకుండినన్,
ముంగిట నిల్చినన్, దలుపుముందర నాగినఁ దొంగిచూచినన్
చెంగున పైకిదూకి చెయిచేసికొనన్ గల యత్తగారతే
యంగెన పంగెనల్ సలుపనై పుటమార్తురు బొక్క బెట్టుచున్.

పోలని యెట్టి దొంగతనముల్ కనిపించిన గాని, పిల్లులే
పాలను క్రిందఁ బోసినను, పాడగు నేపఃచేటు లింటిలో
నే లవలేశమున్ గలిగనేఁ గలదేకద నెట్టిజీవి పా
పాలకు భైరవుండన నభాగ్యపుఁగోడలు నింద మోపగన్.

వచ్చిన నాటినుండి భయభక్తులు చూపుచు నెల్లవారికిన్
నచ్చిన త్రోవనే నడచినన్. ఇలుదీర్పఁగఁ గాకపోయె నే
ముచ్చటకైన బిచ్చమును పొమ్మని చెప్పుటకేన్ స్వతంత్రమా?
పుచ్చిన గవ్వకైన సరిపోలమొ అత్తహయాము లోపలన్.

తల్లిని దండ్రిఁ జుట్టములఁ దమ్ముల నన్నలనైనవారినే
నొల్లక వచ్చె మాకులము నుద్ధరణం బొనరింపఁగా దె నా
పిల్లలలోన దీనినొకపిల్లగఁ జూడవలెన్ గదా యటం
చుల్లములందు నత్తలకు నుండుట నూటికి కోటికొకడా.

తన చిన్నప్పటి త్రోవనే నడుపు నుత్సాహంబుతోఁ గళ్లెముఁ
దనచేతన్ బిగఁబట్టి, కన్నులకు గంతల్ జీనులున్ కాల్గుడుల్
తనరన్ గోడలిపై సవారియయి, చెంతన్ గల్గుకంపన్ పొదన్
తృణరూపంబునఁ ద్రోయునత్త కొరడా దెబ్బల్ ప్రసాదించుచున్.

తానున్ గోడలుకాక యత్తయగునో? తా నత్తచేఁబడ్డ య
వ్వానిన్ వడ్డికి వడ్డి పెంచి యిటు రాఁబట్టన్ విచారించునో
తా నీకోడలిపైన గాక మరి స్వాతంత్ర్యాధికారంబు నెం
తేనిన్ జూపఁగ వీలుకాదనుచునో యేమో దురూహ్యంబెయా.

అచ్చంపుందమ మాతృభక్తి గురుమాహాత్మ్యంబు లోకంబునం
దుచ్చైస్థ్సానము నందఁ జేయుటకునేమో వగ్గు టవ్యస్తపుం
బిచ్చమ్మల్ దగఁజెప్పినట్లు కొడుకుల్ విశ్వాసమేలేక, మేన్
పెచ్చుల్ పెచ్చులు కొట్టుచుండ్రు వలపుం బెండ్లాలఁబండ్లూడగన్.

నిక్కపుఁబ్రేమచేతనొ? కనీసపు టాంగిక సౌఖ్యకాంక్షనో
యొక్కొకవేళ మాపలుకు నూకొను నాథుని ద్రిప్ప నప్పుడే
యెక్కడి దయ్యమమ్మ! యెదియేఁ దినిపించెనొ నెత్తిరుద్దెనో?
చొక్కపు తల్లిప్రేమమనసున్ విరిచెన్ మరపించె నంచునే.

నన్నున్ నామగనిన్ బ్రమోదముగ నేనాడున్ సుఖంబుండనీ
కెన్నన్ బన్నుచునున్న వచ్చియపుడే యేడాది కావచ్చెనే
యన్నన్నా నెలయైనఁ దప్పదిదిగో ద్రాల్ గావలెన్, మన్మలన్
గన్నారన్ గన నోచ నంచు వగచున్ గన్నీరు మున్నీరుగా.

ప్రచ్ఛన్నంబుగ సాగ నీడిచెడి సంబంధాల కీవిల్ల యే
విచ్ఛిన్నంబొ, రహస్యభేదనమొ గావించున్, మొదల్ దీనినే
స్వేచ్ఛావృత్తికి దింపనౌ ననుచు గాసింబెట్టు మాయత్తయే
స్వచ్ఛంబై తన రారఁ గాంచు నెటు మా సౌశీల్యసౌభాగ్యముల్.

వంశము నిల్వఁ జాలు నొకపాటి శరీరము మొల్వదింకనున్
సంశయమేల? కల్గు బహుసంతతి వానిని జేర నానవ
భ్రంశపు దిక్కుమాలిన నెపంబుననే బలవంతపెట్టి, మా
కుంశని బుద్ధులన్ గలపి కూరుతు రత్తలె తార్పుగత్తెలై.

పగలును రాత్రి యొండొరులు పజ్జను జేరిన నేమియౌనొ నా
దిగులుననేమొ? పాయక సతీపతిఁ గంటికి రెప్పపోలనై
మగలను వీడియైనఁ దలమాసిననైనను నిల్లుచేరి, చం
డి గుణముతోడ వెల్గువదినేల్ గలరే గదచుప్పనాతులై.

తమమగలే రసజ్ఞులని తామె యదృష్టము పుష్టి గల్గువా
ర మని కడింది గర్వమున రాణులమంచు దలంచి మమ్ముహీ
నముగ నికృష్ట జీవభరణంబని, మాకడ లేనితప్పు క
ష్టముపడి నెత్తిపైఁ బులుమఁ జాలుదు రొక్కొక తోడికోడలే.

హాసులఁ జిక్కి తావలచినట్టిది రంభగఁ దెచ్చి దానికిఁ
దోసిలి యొగ్గి దాసులగు ధూర్తులు భర్తలచేత లాత్మలో
మా సహనప్రభావమున మాసి సపర్యలు సేయుచుండగా
నా సవతమ్మయే మగని కత్తకు నందరి కెక్కువయ్యెడిఁ.

బావమఱందులైనఁ దమవాని గోరఁ దను బూర్తిచేయఁగాఁ
గావలె, దాయభాగమునఁ గావలె నీచములౌ రసజ్ఞతా
భావము బోల్కఁబోసెదరు, వారిమనంబులె దిబ్బగుంత, ల
మ్మా! వదినా! యనంగ భరమాఁ, దమనోళ్లకుఁ గప్పిపీకనో.

నిక్షేపంబుగ నేను గల్గగనె వానిన్ గూర్చి నీకేల? ప
ద్మాక్షీ! వానిని నిన్నుఁగూడ భరియింపన్ జాలి యున్నాఁడ నే
సాక్షాద్భేదమె నాకు వానికిని? బీజం బంకురం బంచు నే
వక్షః పీఠిక నద్దు మామలును నవ్వా! లేకపోలేదులే.

స్వాములయాన మోచికొని సానులకున్ బరిచర్యచేయుచు
న్నాముగదా యటంచని మనంబున జాలియు లేనియత్తయున్
మామయు మానుశీలముల మచ్చలు పెట్టుచునే తమాస్తి
లో మఱియేరికో యొసఁగి లోపమొనర్తురు కూటిగుడ్డకున్.

నాగతిలేని జీవితమునన్ గలకాలము గాఢమౌ తమి
స్రాగమకృన్నిశీథ సమయంబున నించుక వెల్గువంటి యు
ద్యోగము పోవు నీయెడలనున్నది; పైయధికారి వాని నీ
కౌగిటఁ దన్ను, వేరుగతి కాన మనున్ బ్రతిమాలు భర్తవే.

ఆర్యులధర్మనిర్ణయమునందలి సభ్యతలో రహస్యమౌ
భార్యల నోమగా గలుగు బాధ్యత దీర్పఁగఁ జేతగాని ని
ర్వీర్యులు సిగ్గులేక తమపెండ్లములన్ గని కామవేదనా
హార్యదురంత దుఃఖితులకై యొనరింత్రు పరోపకారముల్.

ధవునాజ్ఞఁ శిరసావహించు టది సద్ధర్మంబె యా సాధ్వికిఁ
ధవుఁడన్నింట విచక్షణుండయిన; యుక్తాయుక్తవిజ్ఞాన బు
ద్ధి విహీనుండును శాస్త్రదృష్ట మని యాధిక్యాధిపత్యంబుతో
డ విజృంభించిన నోరుచచ్చి పడియుండఁ బోలునా? చాలునా?

సమఖండాంతర రాజకీయముల నుచ్చైస్థానమా? మానవ
త్వమె గోల్పోయినఁ, దుచ్ఛమానవుల సేవావృత్తియం దేహ్యభా
వములున్ బైకొనినన్, మతాంతరులు బ్రువ్వఁ దిట్టినఁ, లేని రో
సము, నాధిక్యము, నాత్మగౌరవము హెచ్చా నింటిలో భార్యపై.

కీడులుమూడు కర్జములకే మతిహీనతఁ జేయు పూనికల్
జోడుగ నున్నదోసమునఁ జూడఁగ నేరక మంచి చెప్పినఁ
బూడుతు బుద్ధిచెప్పెదవె? పొమ్మని చేసెడి పోడుపోడుగా
దాడుది చెప్పుమాట వినుటా? యవమానము చేటుగా మగల్.

తొణికిసలాడు జవ్వనపుఁదోఁయలి వృద్ధున కంటఁగట్టుచోఁ
బణతిని బాముల౯ గుడిపి పణ్యవధూటుల పంచఁ జేరుచోఁ
బ్రణయము లేనిదానిపయి బావురుగాండ్రనయుంబు సూపుచోఁ
నణగినసంఘ మన్దై కలదా సతికొంచెము నోరుచేయుచోఁ.

బద్ధము లేద యెవ్వరికి భామిను లొంటిగ నుండ నేవయో
వృద్ధులునైనవార లెపుడే నరుదెంచిన నేమిగోగమో
అద్ధవళేక్షణా కచకుచాది విలాస నిబద్ధులై యసం
బద్ధము లౌ ప్రలాపములె పాడుదు రేమియుగ ప్రభావమో.

ఏతీర్థంబులకేగి క్రుంకులిడనీ, యేక్షేత్రరాజంబు ని
చ్ఛాతాత్పర్యముతో వినమ్రత నమస్కారంబు లర్పింపనీ
పైతృశ్రాద్ధవిధిఁ సభక్తికముగా వడ్డింపనీ, దోషసం
జాతంబౌ మగచూపు చూఁడి గుడుగుంచాలాడు మాపైఁటలో.

ఊరేగింపులలో, మహాసభలలో, నుద్యానవాటీ విహా
రారామమ్ముల, రైళ్ల, బస్సుల, బజారంగళ్లలో, గుళ్లలో,
తోరంపుఁ సినిమాల, నాటకము లందుఁ బావులఁ రేవులం
దేరీతిఁ దిరుగాడుచున్నసరె యడ్డే కన్నుమాపైననే.

అణువైనఁ గురువైన నేయొకని సాహాయ్యంబు నర్థించి నా
యన! యంచుఁ దరిఁ జేరనీ; యెచట నేయాపత్తునందున్న యిం
తిని దామేకని సుంతతోడుపడనీ, దృష్టిప్రసారంబు తో
డన మాశీలపులంచ మాసపడకుండఁ బోవరే పూరుషుల్.

ఇంటనె యున్న లేక యెటకేఁ జనుచుండిన వచ్చుచుండినఁ
ఒంటరిపాటుగాఁ గదిసి యూరక చూచినఁజాలు, దానికాం
గంటినఁజాలు, మూర్కొనిన నంతియె చాలునటంచుదూకునీ
తుంటరి పూరుషాకృతులతోఁ గల సంఘమిదేమి సంఘమో.

ఏ పేరంటమొ, పెండ్లివిందొ, వడుగో, యేపండుగో, పబ్బమో,
యేపాడౌ తిరునాళ్లో, యుత్సవములో, యింతుల్ గుముల్ గూడగాఁ
బ్రాపైనఁ రసికాగ్రగణ్యులకదే పర్వంపు కాలంబగుఁ
పైపైఁజూపులు పల్కరింపులును నాపై నంతకుఁ బైపనుల్.

నిన్నుఁ మన్ననసేయు నీమగనిఁ దుంఁడింపఁ విచారింతువా?
కన్నుల్ దెర్వని చిన్నిపాపలను ముక్కల్ సేయ దుఃఖింతువా?
నన్నుఁ జేరి సుఖింతువా? యనుఖలుఁ మన్నించుటా? మానుటా?
విన్నంతఁ వెలివేయు సంఘమున కెవ్వో బాధ్యతల్ గల్గవా?

నాపల్కుఁ వినిపించుకోద, యెపుడే నాకోర్కులఁదీర్ప దా
రా పోనిత్తునె? చేతు దీని కుభయభ్రష్టత్వముఁ; లేనిచో
నా పేరా? యని దానియడ్రసునకైనఁ భర్తకైనఁ రహో
వ్యాపారంబులు తెల్పి వ్రాసెడి మహాపాపాత్ములున్నారుగా.

ఏదోమాటకు మాట వచ్చిన సరే, యేతీవ్రవాదంబులో
భేదంబుల్ పొసగించుకొన్న సరె, యెవ్డే మద్యసేవా మదో
న్మాదావస్థ సరే, మతాంతరుల దౌర్మార్గ్యంబుతోడఁ సరే
యాదిఁ మూదగు శీలసంపదకె ముప్పౌఁజేతనో వాతనో?

పాపిష్ఠి తోడి సంఘము
నాపగఁ దగుశక్తిలేని యనదయుఁ దప్పుఁ
మాపయికిఁ ద్రిప్పి "భార్యా
రూపవతీ శత్రు"వనుచు లోలో నేడ్చుఁ.

ఏడు గ్మార్గులు వచ్చిపోకిరులుగా నేయన్నెముఁ పున్నెముఁ
మీదుఁ నేరని సాధువర్తనల బల్మిఁ మానముఁ దోచుకో
నాదౌర్భాగ్యపు టాడువారి కొకప్రాయశ్చిత్తమే లేద దే
మీ? దౌష్ట్యం బొనరించువారి కొకశిక్షే లేద సంఘంబునఁ?

పోనీ నిన్నవివేకివై తనపురంబున్ జేర్పఁ గొంపోయెనే
గానీ పాపము రావణాసురుఁడు తాకన్ బల్మిగా బైఁబడన్
బూనండే గద ? వేచె నీయనుమతిన్ బొందంగ; మా రావణుల్
ప్రాణాలుండిన మానముల్ గొనక పైపై చూచి పోనిత్తురే ?

అలనాఁ డీ వానరింపగావలసెఁగా కగ్నిప్రవేశంబు ని
ర్మల సౌశీల్య పరీక్షణార్థముగ భర్త్రాజ్ఞన్ మన స్తృప్తిగా;
నిలపై మాకగు మానరక్షణము దిక్కే లేక, మానుండి మా
తలిదండ్రుల్ మగలున్ మదిన్ బొగలు చింతల్ జూడగా లేకయున్.

పక్షియె ప్రాణముల్ విడిచె, వానరముల్ వలికెన్, పతివ్రతా
రక్షణ ధర్మకార్యమున, రక్కసుపీటనె కొల్వునందె నీ
పక్షము మాటలాడఁగల వారును, నీకటఁబల్కుతోడు, ప్ర
త్యక్షము; నేటికట్టి దొకటైననరే గగనారవిందమే.

మానస మెంత పుణ్య మహిమన్ బరిశుద్ధముగా మెలంగినన్
గానని గ్రుడ్డిలోక మనఘంబగు మత్కృత సంఘసేవకా
ర్యానికిఁ గన్నుకుట్టి, యితరంబగు హేతువులేమి శీలమూ
లానికె చిచ్చుపెట్టగఁ దలంచెడి, మాపయి నెంతక్రోధమో ?

ఇంతికిఁ బాడుయావన మదేటికిఁ బెట్టెనొ ? బ్రహ్మ యత్తరిన్
పంతము పూను మాపయిఁ బ్రపంచమె, యేమగవారి నెప్పుడేన్
వంతుకుఁ బిల్చినన్ బిలువబడ్డను, చూచినఁ జూడబడ్డఁ గొం
డంత యభాండ మాసతికి నప్పుడె నెత్తికి నంటఁగట్టెడిన్.

కట్టడి కామరూప విషగహ్వర ఘోర భుజంగ రాజికిన్
పుట్టలు పూరుషాకృతులు పొమ్మని లోకము గట్టినమ్మకం
బుట్టిపడంగ నాకెలన నుండిన వారల కంటఁగట్టెడిన్
జెట్టలు; పుట్టమీఁద చలిచీమయు గుట్టినఁ బాముకాటుగా.

తమతప్పినను గాని తత్ఫలితసంధానంబు కానించువా
రము మేమే గద! మాదితప్పయిన నిల్వన్ నీడయున్నే? ప్రపం
చమునందున్? ములుఁబోయి మీఁదఁబడినన్ జాల్, ముంటిపైఁదా
నెపడ్డ మరేమా నరటాకు? దుండగముపీడన్ బోదు రేలా? మగల్.

తప్పయినన్ విభుండనుమతంబుగఁ జెప్పినఁ జేయకున్న చో
తప్పా, పడంతి యొప్పయినఁదాఁ దనయంతన సేయబూనినన్
తప్పా, వివేకహీనముగ దండన సేయగ మారుపల్కినన్
తప్పా, భువిన్ జనించుటయె తప్పా నిజంబుగ నాడుపుట్టువై.

తండ్రుల్ కన్నులఁ గట్టినట్లయి మనస్తాపంబుతో వేగిరా
తుండ్రన్ దిన్నగఁ జూచి వత్తమని యెంతో ప్రీతితో వచ్చినన్
తీండ్రంబుల్ పచరించి, చీకటిని గొట్టిండ్లన్ నిగూఢించి కో
డండ్రన్ గన్నులఁ గాననీని బలుదిట్టల్ వియ్యపుం దయ్యముల్.

నెట్టన గల్లుచిక్కులు గణింపక యీతడ వేనెపంబులన్
బెట్టక పంపుఁడయ్య యొడిబియ్యము పెట్టుదు మాడుబిడ్డకున్
గుట్టుగ మన్నవార మిదిగో యివిచేతులుకాదు కాళ్లునా
నెట్టి యెడందలో కరుగ వింతయు వియ్యమువారి కెవ్వొడన్.

మా మర్యాదకు వస్తువాహనములా? మంచాల? కంచాల? యి
ట్లే మీయర్ గతిలేని వారికిని మాకింకేటి బాంధవ్యముల్ ?
పో మీవారిని గోరి చీరలును సొమ్ముల్ హెచ్చుగా దెచ్చినన్
రా మాయింటి కటంచు పెద్దలగు వారల్ త్రోతురత్తింటిలో.

ఏమీ యావెధవాయ నీల్గుడులు రానేరాఁడు మాయింటికిన్
మేమేమంత నికృష్ట మానవులమా ? మేండ్రించి గాండ్రించి మ
స్మే మాత్రంబు చలింపఁజేయఁగలరో ? యీక్షింతు మే పంప మే
పో మాపిల్ల నటంచు భర్తయెడకున్ బోనీరు పుట్టింటిలో.

బంగారంబు నమూల్యవస్త్రములు నిర్బంధించి పెట్టించి, వా
నిం గాజేసి, సమర్తకా దనుచు నెంతేఁగాలమున్ పుచ్చి, దా
ట్లుం గాకున్న నిషేకమున్ జరిపి, యల్లున్ మందులన్ మాకులన్
లోంగన్ జేతురు కానిచో ననలుకే లోపంబు గావింపనై.

అవలఁ దన్ను మోసి కని యచ్చట ముచ్చట తీర్చువారలే
యీవల జీవనంబు హృదయేశుఁడు నాతనిఁ గన్నవారలే
యేవలవారికే నిమమ లేమియుఁ గల్గిన గ్రుంగిపోవు స్వా
భావిక భీరువుల్ సతులు వారలవైరము లెట్లు చూతురో.

కవి యనిపేరుపెట్టుకొని కాంతలమానము కడ్గిపోయుటే
యువిదలకున్ స్వభావముగ నున్న శుచిత్వము నేటఁగల్పుటే
ప్రవిమలభావ మార్దవము చిన్నదనంబు నపహ్నవించుటే
అవి యివి చెప్పనేల ? కలవన్నియు పోకిరి చేష్టలేసుమీ!

ఏరవ వ్రాయఁబూని కలమెత్తిన కాంతలపిచ్చి యెత్తులే
వేరు పదార్థముల్ దొరకవే సతిపై ధ్వజమెత్తుటే, యిఁకే
యేరస మాధురిఁ రసన యేమను? బూతుల పచ్చిపచ్చి శృం
గారరసంబె క్రోలవలెఁగా యిసి! యెంతనికృష్టమో గదే.

సతుల యుదార మానసిక సత్త్వము తత్త్వముకానరాకయో?
అతుల నిగూఢ భావన మహత్త్వము భృత్త్వమెరుంగలేకయో?
మిత హిత వాక్ప్రభావము సుమిత్త్వముస్త్రీత్త్వము పాలుపోకయో?
మతిచెడియో యభావ మహిమా తనువర్ణన ప్రొద్దుపోకయో?

రాజులు వీథివెంట నగరంబున నేగుచునుండ నందరం
భోజముఖుల్ కలంతపడి పోదురుచూడగనంట, అంతె కా
దాజనపాలుఁ గూడనగునా? యనువారట, సిగ్గు, మానసాం
భోజ సుకర్ణికాగతుని మోమది యేకవిగాఁడు చూచెనో?

శిష్టులకేనికృష్టము విశిష్ట మహోజ్జ్వల పావనంబె యౌ,
దుష్టులపాలి కీజగమె దుష్టము, కాంతలపైఁ బ్రలాపముల్
కష్టముసిగ్గులేక వినఁగల్గుట సభ్యతగల్గువారికి
నిష్టము వచ్చినట్లు లిఖియించుటకే రధికారమిచ్చిరో.

ఆవిపరీతవర్ణనల కంతులుపంతులు లేవ, మవ్వపుం
దీవియఁబోలు కన్నియకు దిక్కు దివాణము లేదటంచునో
కావలికాచు కూర్మి చెలికత్తెలు వీడిన, నాత్మనాయకుం
డే విరతిఁ వహించినను నెంతకు నీకవిపీడ దప్పునే?

తమహృదయాంతరాళముల దాగిన తత్త్వము వెల్లడించు మో
దమె యగుగాక శిల్పులకు, దర్శనభాగ్యముగల్గెనన్న భా
వమె యగుగాక చూపరకు, వాడరొ చీరలు కంచుకంబులున్
దమ చెలియండ్రు నాండ్రు, వనితల్ గనుపింతురొ, యెందునాగతిన్.

ఆతురతన్ బవిత్ర నిలయంబులు దేవతలుండు తావులం
చేతరిఁ జూడఁబోయి పరమేశ్వరదివ్యవిలాస సత్కథా
భూత విచిత్ర శిల్పముల పొంతలకేగిన నేన్ మమున్ బరా
భూతలఁ జేయు, మానములు పోవగఁ జెక్కిన వ్యంగ్యశిల్పమున్.

తమకపటంపుచేతలకుఁ దప్పిన రూపవతీ సుశీల స
ద్విమలత బాపకే తనివితీరక శిల్పకళాప్రతిష్ఠనా
మమున నసహ్యసంజనక మర్మవిభేదక నగ్నచిత్రరూ
పమున సృజించి తీర్చుకొను వారలు మానసికోల్బణంబులన్.

ఏ యవివేకపున్ విషయమేనిఁ బ్రచారము చేయఁ బూనియో
యే యపహాసవాక్యముల కేని స్వరూపము నీయ నెంచియో
యే యమృతాంజనంపు గుణ మెల్లలకున్ విదితంబు సేయనో
వేయుదురెట్లు? నీతిగనిపింపని రీతిగ నాడుబొమ్మలన్.

తామీనాటికి పెద్దమానిసులు గాదా? యింతవారింత నె
ట్లో మెల్యంబడినారొ? యూడిపడినారో యాశసంబందుతనన్?
ప్రేమాపూర్ణత గర్భకోశమున నెట్లే మోసికన్నందుకున్
మామాతృమ్ముపైఁ గృతజ్ఞతయు నేమాత్రంబు చూపింపరో?

ఏమో మమ్ముల నుద్ధరింతురని యెంతేఁ బ్రీతిగాఁ గోరి, మా
లో మా యౌవన భోగవాంఛలు సుఖాలున్ మట్టిపాల్జేసి, యు
ద్దామాయాసపుఁ బ్రాణఖండములు చేతఃప్రీతిఁ గన్నందుకున్
మామాతృముపైని గౌరవము నేమాత్రంబు చూపింపరో?

కలిమిన్ లేమిని, గష్టమందుఁ గడుసౌఖ్యంబందు నిర్వ్యాజవ
త్సలతా పూరితమైన నిండుమది నుత్సాహంబుతో తాల్మితో
గల సర్వస్వము బిడ్డలే యనుచు నుత్కర్షంబు పోషించి ని
ర్మల ప్రేమామృత సారమున్ గురియు మామాతృత్వముం గానరో.

ఏసన్యాసులు సాంఖ్యయోగరతు లేయేభక్తు లేజ్ఞానులున్
ఏసంస్కర్తలు, శాసనాధికృతు లేయే చక్రవర్తుల్ కవుల్
వాసిన్ గాంచిన బ్రహ్మవాదులును యుష్వల్ కాముకుల్వంచకుల్
స్త్రీసంఘంబుల గర్భవాసముల నుర్విన్ బడ్డవారే కదా!

నోటన్ స్తన్యము పెట్టి పాలుకుడువన్ జూపించి, మాప్రక్కలోఁ
బూటన్ బూటకుఁ బ్రోదిచేసిన ఋణంబున్ జన్మతో నీగనే
పాటన్ బోలునె? యామజాతి యెడ విశ్వాసంబుతో నెల్ల పో
రాటంబుల్విడి మాతృభావమున నారాధించుటల్ తక్కుగా.

కామిని కర్మకారి పతి కాలము తప్పిన నన్యవాంఛగా
నీ మరి పెండ్లిగాని తగనే తగదందురు మంచిదే; మగ
స్వామికి ధర్మరక్షణము సంతతి కోసము రెండొమూడొ నా
ల్గో మరి యెన్నియో మనసుకోరిన యంత కనుజ్ఞయే కదా!

స్వామికి ధర్మరక్షణము భామిని కింద్రియ నిగ్రహంబునా ?
కామము సాటిగా గలుగఁగా విధవావిధురుల్ సమానులే
గా మరి, ధర్మరక్షణము కావలెనన్న సమాన బాధ్యతల్
లేమియు దోషమే యగును లేమల కర్మమదెంతశోచ్యమో.

నిజముగః ప్రేమతత్త్వము ఘనీభవమందిన వారి కెన్నఁడే
ని జత తొలంగిపోవునెడ నిల్వ్యన నీరయి క్రుంగిపోవరే
ని జనులె? పత్నులైన మరణించెడి నీమగపత్నులేమిగా
ని జగతి నేకనిష్ఠను గణింపరు వీడరు తుచ్ఛమోహమున్.

తలపుల స్వర్గపట్టణము దాకను వీడని బ్రహ్మముళ్లతోఁ
గలిసిన జంటలో నొకరు కాలము తప్పిన నున్నవారిలో
పల నొకరిన్ పునః ప్రణయభావ విలాసులఁజేసి, యొక్కరిన్
తల గోరిగించి కూడని వెతల్ గుడిపించు టిదేమిధర్మమో.

ఉండినవన్ని యిద్దరికి నుండవలెన్ సుఖదుఃఖరాశి, లే
కుండినవన్ని యిద్దరికి నుండకపోవలెఁగాని, యొక్కచో
నుండినవన్ని యింకొకట నుండకపోవుటిదేమి ? యెంతకున్
బండితు లేశ్రుతి స్మృతులవాక్కులకున్ నవభాష్యకర్తలే.

తొలఁగవు పాంచభౌతిము స్థూలశరీరము దూలినంత ని
ర్మలతరప్రేమ బంధములు మానసికంబులు; పూర్వవాసనా
బలమున జన్మజన్మములఁ బాయక యైక్యమునందునట్టియా
కలయికకున్ విరుద్ధము విఘాతము గావా పునర్వివాహముల్.

కర్మముగాలి యాత్మవిభుకై యనిశంబును నేడ్చియేడ్చి, యం
తర్ముఖ దుఃఖభార సువిదారితమానసలై విరక్తలౌ
నిర్మలభావయోగ తరుణీజనమున్ గసరింపు మాటలన్
దుర్ముఖతాప్రయుక్తమగు దోషపు దృక్కుల గ్రుచ్చనేటికిన్.

గుండతనంబుతో నొకరు గూర్చిరొ? కర్మమె తెచ్చిపెట్టెనో
ముండతనంబె వచ్చె, మొగమోటమిదైనను లేకపోయె, నీ
వుండగ నేమి? సాటిపడతుల్ గడుచుల్కగ ముండమోపియం
చుండగ వేరువారిపయి నూరక నోరువిడంగ నేటికిన్?

భర్తలపీడకుండ బలవంతముగానో? పరేచ్ఛనో? మన
స్స్ఫూర్తిగనో? చితిన్ బడి యశోచ్యత నొందెడి నాడువారికిన్
గూర్తుమటంచు నాపుదలకున్ సమకట్టి జయించు సంఘసం
స్కర్తలె ముండమోపియనుజాతికి నూతన సృష్టికర్తలౌ.

ఏమో స్త్రీపయి నోర్వఁబోయిన దశా హీనాత్మతన్ బోలె నెం
తో మోసంబుగ చావునాపిన మహాత్ముల్ వారి ప్రత్యేకతా
సామాన్యత్వములన్ గణింపకయె సంసారంపుటిక్కట్లన్ పునః
కామోద్రేకముగల్గు సాధనములన్ గల్పింపగాఁ బాడియే?

ముందైనన్ దమయాంత్రకున్ దమకు నెప్డున్ సేవలన్ జేయగా
నంద్రైయుండు, మగండు పిల్లలని యేవ్యాసంగముల్ లేక, యు
ప్పిండే దండుగ, సొమ్ము చీరలని యేవే కాని కాఁబట్టి వా
క్కుండున్, మేలని వారివృద్ధి నెటులేఁ గల్పించి రొక్కుస్తుడిన్.

క్రూరాఘంబులు జన్మజన్మములఁ బెక్కుంజేసియే నేటికీ
నారీజన్మము, నందునన్ బతివిహీనత్వంబు ప్రాప్తించె నం
చే రోదింపఁ బిశాచవర్తనుల కామేచ్ఛాహతిన్ జిక్కుచో
ప్రారబ్ధానికి భ్రూణహత్యలును గర్భస్రావముల్ దోడగున్.

నికరపు బ్రాహ్మణీక మని నీల్గుడు కల్గు సనాతనబ్రువుల్
ప్రకటిత వాక్కులన్ మడుగు పట్టని ప్రాయపుముండ చేతి వం
టకము భుజింపమంద్రు, మది నానయు నేవయు లేవొ యాంతరం
గిక విషయ వ్యథాహతి సకేశి వికేశిరహో వ్యవాయముల్.

పిరావేశపుఁ బంగనామములె, మైవిభూతితోఁ బెండెక
ట్లే, రుద్రాక్షలె, ముద్రలే, తులసిపేర్లే, భక్తసన్యాస వే
షారంభంబులె, పాదపూజలెకదా ఆసామి; మామీదముం
డారండాధర సోమపానములె కంఠాశ్లేష సంధానమే.

లలనా లాలన ఖేలనాకలన గూర్పం దక్షమాత్రోవ, లో
కులకున్ గన్నులు గప్పిపుచ్చుటకు భోగుల్ కొందరాచార్యులై
లలితాలాపములన్ విలాసముల నాలాపాల శ్రీరంగ నీ
తులు బోధించుచుఁ గొల్లగొట్టుదురె యస్తోకాంగనా శీలముల్?

ఏరెట్లున్న సువర్ణ పుష్పములతోనే పాదపూజల్, ఘనం
బారీతిన్ దమభిక్షులున్ సలుప మెప్పై, శుద్ధిపత్రంబులున్
ఈశేఁ దప్పులు సాకుగా వెదకి, యడ్డే శ్రీముఖాలంపు శ్రీ
వారా? మానవతీ సహాయ మొనరింపన్ జాలునే తూపరుల్.

అవి యివి తెచ్చియిచ్చి తగ నచ్చికబుచ్చికలాడి గూడి, యొ
క్కవిధముగాక వేగతులఁ గన్నెఱికం బెడఁబాపి, మోహపు
న్నివశత భోగసాధనగఁ బెండ్లి పెడాకులు మాన్పి, జీవితం
బె విసుగ దేవదాసులనుపేరున గూల్చిరి స్వార్థసిద్ధికై.

తముతామే పరువారి రోవెలఁదు లిండ్లఁ దొంగగా దూరి, వ
ద్దు మహాత్మా! యనుచున్న నెక్కువయి పద్దుల్ పద్దు లేదుద్దు వ
ర్షము గుర్తించుచు, నింటికుక్కలయి మంచాల్ వేసియుఁ దీసి, పా
దములఁ బట్టుచుఁ బ్రక్కకుఁ జుణిగిపోఁ దప్పించుకోసి రయో!

అనరాదూరక వారకాంతలదె తప్పం, చిండ్లలోదూరి, ర
మ్మనుచుఁ గుంజుకపోయిరా? ముగుద పెండ్లాలోడులఁ బోసికొ
మ్మనిరా? కొంపలు గుల్ల బల్మిఁగొని సన్యాసంబు లిప్పించిరా?
మనబంగారమె మంచిదైన నెవఁడేమాత్రంబు పేర్వెట్టెడుఁ.

ఏదేవోత్సవమైన ముందునకు ముందే సానిమేళంబు సం
పాదింపఁ జతనంబె, దేవుని యెడఁ భక్తిప్రపత్త్యాత్మతో
నే దర్శింపగ వచ్చువార లెవరో? యేమో? విలాసాంగనా
పాదాఘాతమె మోక్షసాధనముగా భావింతురీపోకిరుల్.

'నాతిచరామి' యంచుఁ బ్రతినల్ వచియింపుచు నగ్నిసాక్షిగా
బ్రీతిగ నావధూవరులు పెండిలిచేసికొనంగ దీక్షలోఁ
బూతములైన భావములు పొంపిరిపోవగ నంకురింప వ్యా
ఘాతములైన మేళములఁ గశ్మలతఁ గలిగింపఁ బాడియే.

నాటక పాత్రధారణమునన్ మగవారికి నాడువేషముల్
బూటకమా, నసహ్యమగు, పోలదు మీదుకళాభివృద్ధికిన్
జేటగు నంచు వేశ్యలను జేరిచి; రుత్తమపాత్రపోషణల్
సూటి యటంచు నేరిపిరిసూ మగనాండ్రకు జారవృత్తులన్.

సినిమా పేరి ముసుంగు వేసముల గాసిన్ బెట్టగా నారితే
రిన రౌడల్ నటకావతంసకులు, డైరెక్టర్లు, ప్రొడ్యూసరుల్
చనుపై చీరలుకట్టి రంగులును వేసాల్ వేయువా, రొక్కరా?
వనితాశీలము పశ్యతోహరులు దుర్వ్యాపార పారాయణుల్.

పావన మార్యసభ్యతను బాసి సుఖప్రద కర్మయోగమున్
బోవిడి, నూత్నసభ్యతలఁ బోఁ జెడిఁ తాఁజెడి నట్టికోతి య
ట్లే వనమంతయున్ జెఱచు రీతిగ నచ్చుపుమానసంబులం
దావిలభావకందళము లత్తుకొనన్ గృషిసేసి రక్కటా!

వైరము సఖ్యమున్ గలుగు భావనతోడనె; యస్లెగౌరవా
గౌరవ భావముల్; విహితకార్యకలాపము లుజ్జగించినన్
గారవ మబ్బఁబోదు; వెటకారపు మోసపు బోధనాపరుల్
కోరి యొనర్చి రీపనులకున్ గొఱమాలిన మంచిచెడ్డలన్.

స్త్రీత్వము పుంస్త్వమున్ బ్రకృతి సిద్ధములైనవి, స్వస్వభావభి
న్నత్వము సృష్టితో గలుగునాన్, విహితప్రతి కర్మలన్ సమా
నత్వములేమి లోపమగునా? తమకల్పనలే గురుత్వ ని
చత్వము లెల్ల కర్మలకు స్వప్రతిపావనసాధకంబుగా.

తియ్యంబుల్ బలె వ్యంగ్యగర్భితముగా స్త్రీజాతి వ్యాజస్తుతిన్
'అయ్యో! యెప్పుడు వంటయింటఁబడి యున్నా యయ్యంబుపా లైతి రే
మియ్యాపత్తును దీసివేసెదము మీ రింకేల శంకింపగాఁ
జెయ్యం జెయ్యి ఘటించి రండు వెలి మీ శ్రేయార్థమై యుందురా ?

దయ్యంగొట్టిరి, పౌరుషంబు చెడె, కష్టంబయ్యె, మా చేతఁగా
దియ్యార్తిన్ దలగంగ నీతరిని మీరే మాకు సాహాయ్యముం
జెయ్యం జాలిన వారలాప్తు లటుచున్ విశ్వాసపాత్రంబుగా
కుయ్యో మొఱ్ఱో యనంగ నేటికిటు నిష్ఠుల్? లేని గాంభీర్యముల్.

పనులన్ గూర్పఁగ లేక క్రిందఁ బడినన్ బైచెయ్యి మాదే కదా!
యను తత్త్వంబున మాటలాడుటయె సిగ్గౌగాని, యొంటైన నొ
క్కనికిన్ జేయఁగరాని కార్యముల నొక్కండింత చేయూత ని
చ్చినఁ దప్పౌనె? స్వతంత్ర సాధనకునై స్త్రీలున్ బ్రయత్నింపరే?

చదువుల్ నేరిచి, పట్టభద్రులము; బల్ శాస్త్రంపువాదంబులం
దెదురెవ్వారలు లేని పండితులమై, యేరీతి విద్యావిహీ
నదశన్ దూషితమూఢవర్తనలతో నాడెంపు సంతోషసం
పద నొందన్ గలవారమంచు నిరసింపన్ జూతురా? మమ్ములన్.

మాకఁట విద్యరాదఁట, తమంతట తామఁట నాడు నేటికిన్
బ్రాకట పాండితీబల మపారముగాఁ గపటప్రయోగమం
దేకట పోవ చేవపడి, హీనుల సేవకవృత్తినైన, న
[illegible]ాకట నాలుబిడ్డలకు నాదుకొనన్ గల ధన్యజీవనుల్.

మాటకున్నైన విద్యయను మాటకె యర్థము సెప్పలేని వా
చాటులు జీవితాంతమును సద్వ్రతదీక్షల వెళ్లఁబుచ్చు, చే
లోటును లేక యింటినిలలోఁగల స్వర్గముగా నొనర్చు మా
బోటుల విద్యరా దనెడి పొచ్చెములన్ నిరసింతు రక్కటా!

చేవ్రాల్ సేయఁగ వచ్చినంత చదువుల్ సిద్ధించినట్లాయెనా?
తీవ్రంబౌ క్రమశిక్షతోడి కులవృత్తిన్ జేయు ధన్యాత్మకుం
డా? వ్రాత్యుండగు? నీవిభేదములతోడన్ గోరినట్టే జనా
భావ్రాయించెడివారి దెప్పు మనలోపంబా? యదేసత్యమా?

ఎవరో భారతదేశవాసులకు నెంతే విద్యరాదన్నచో
నవునంచున్ దలయూపి యొప్పుకొనుటేనా? వేదవేదాంగశా
స్త్ర విచారంబుల గట్టిపండితులఁ దిద్దన్మాత్రులా? మంచి, చె
డ్డ వివేకంబులు నేర్పువారు? నగుబాటౌ, సిగ్గుచేటౌఁజుమీ.

చూచిన యక్కరాల్ వరుస చొప్పున నోటవచింప నేర్చుకొం
టా? చెయి యెత్తకుండ నొకటన్ వడిగోకుట? గొంతుచించుకొం
టా? చదువన్న? జీవితరహస్యము నేర్చుటయా? నవీతిబో
ధా చరణప్రచారణము లన్నవి విద్యలకు నాలుగంగముల్.

ఎటయినఁ బొట్టనింపుకొనుటే పరమార్థముకాదు, మోసపు
న్నటనల నేహ్యభావమును నానయు పేడిధనంబు సేకరిం
చుటె ఫలితంబుగాదు, గడుసుందన మందుటకాదు భావ, మె
చ్చుట? జనులెల్ల నాల్గుపురుషార్థము లందుటె సిద్ధి విద్యకున్.

అమలంబైన సుశీల సద్గుణ మనీషాధిక్య సంపత్తిఁ, దా
న మరుల్ గొల్పి వరింపఁ జేయఁగల విజ్ఞానంబు గోల్పోయి, మం
త్రములన్ యంత్రములన్, అమానుషములౌ తంత్రంబులన్ మానినీ
విమలాత్మాపహృతి ప్రవృత్తి అదియున్ విద్యా? కళా? శాస్త్రమా?

మా సౌశీల్యము సళ్లఁజేయుటకునై మాయున్నతిన్ గోరు నెం
తో సత్యాగులుపోలె మాకు చదువేదో లేదు రాదంచు నే
బీ, సీ, డీ, లను దిద్దఁబెట్టి, సభలన్ వెన్నంటి, బల్ గొట్టి, మా
లో సింగారము జుట్టి త్రేచెదరు లోలో నుబ్బి తబ్బిబ్బులై.

అప్రాచ్యాదృత సంప్రదాయముల లోనైన, ఆర్యసంస్కారమే
స్త్రీప్రాముఖ్యముపైని సంకుచిత దృష్టిన్ జూపెనంచేమియే
మో ప్రాగల్భ్యము వెల్లడించి, విపరీతోద్వృత్తికిన్ దింపగా
నౌ ప్రారంభములే, ప్రచారములె, యాథార్థ్యంబుచూహింపరే?

రావలెఁ జేయిపట్టుకొని రచ్చకు వీధులవెంట, ప్రక్కఁ గూ
ర్చోవలె, నెవ్వరేయెడల సోకిన చూడని యట్లు చేయియం
దీవలె, నవ్వుచున్ బలుకరింప వలెన్, మదిభేదభావముల్
పోవలెఁబూర్తి యందురు విమూఢులు సంస్కరణానుయాయులై.

ఏ నిముసంబు మానస మొకింత విశృంఖల వృత్తిసంచరిం
చా నిముషంబె మానవు ననర్థపరంపర చుట్టిముట్టు గా
దా? నిరంతంబు తుచ్ఛవిషయవ్యథఁ గూలిన సౌఖ్యలేశమున్
గానరు గాన ధర్మమను కళ్లెమునన్ మదిఁ బట్టగాఁదగున్.

చూచినదెల్లఁ గోరుటయె సుందరవస్తుసమూహ మంతటిన్
వాచవిచూడఁ బూనుటయె స్వామ్యము సుంతయు లేనివానిపై
వేచెయిజాచుటే మనసు వేగమునన్ దలమున్కలౌటయే
యీచపలస్వభావయుతు లేమి ప్రపంచము నుద్ధరింతురో.

సభలందున్ మహిళా సమాజములలో చర్చాది వ్యాసంగతన్
రభసోద్రేకము వెల్లడించుటకె స్త్రీస్వాతంత్ర్యమున్ గూర్చి, శాం
తభవిష్యత్తును గూర్చి, చెప్పుదురుపన్యాసాలు, పెండ్లాల నిం
టభృశంబున్ యమయాతనల్గుడుపుచుంటల్మానలే రంత యుం.

తీయనిసామవాక్యములు, తేరకుఁ బల్కెడు బూనపద్ధతుల్
మాయలమారిభేదములు, మానము లోఁగొనజాలుదండనా
లేయవి యెట్టులే సలుప నిష్మటుకాకిటు ప్రాప్తప్రవృత్తిగన్
ఛీ! యవివేకపుంబనులు సేయఁగ నేర్తురె భారతాంగనల్.

సతి యర్ధాంగి యటంచు నాయమయనుజ్ఞాపాలనాలబ్ధమా
నిత సౌజన్యవిశేషయుక్తునకె గానీ సర్వకర్మాధికా
రత లేదంచు శ్రుతిస్మృతి ప్రభుతు లౌరా ముక్తకంఠంబుతో
డుత ఘోషింపఁ గడంగుఁగాదన నెవండున్ వారి ప్రాముఖ్యమున్.

గృహసామ్రాజ్ఞి పురంధ్రికాక మరియే రీనాటి కానాటికిన్?
బహుబాధాకల్పిత వక్రభాషకులె మా స్వాతంత్ర్యభావంబు ల
న్వహమున్ జూచుచుఁ గన్నుకుట్టి విపరీతాదర్శములన్ సూపి,
మా సహనాశక్తికి వేరుపుర్వులుగ స్వేచ్ఛాబోధనల్ సేసిరా.

మా స్వాతంత్ర్యము నుద్ధరింతురని నమ్మఁగ, అచ్చికల్ బుచ్చికల్
విశ్వాసంబులు, వింతగౌరవము లువ్విళ్ళూరఁ గావించినన్
ఆస్వాద్యం బగు మా విలాసరసప్రేమా విద్ధమా శీలస
ర్వస్వ మ్మున్న కుతంత్ర పూరితుల దౌర్జన్యంబు కాదీపయిన్.

గోముగుఁ, జెప్పులు, కంటియద్దములు, సిగ్గుఁ సబ్బులుఁ, రిబ్బనుల్,
గడుసుంజూపులు, బల్ విలాసములు, నిర్లక్ష్యప్రలాపంబులుఁ,
దుసుకుంజేతలు, రచ్చకెక్కుటలు, భక్తుల్ పూజలుఁ మానుటల్,
మడుగాచారము మంటగల్పుట, లివెల్లఁ గల్గుటే స్వేచ్ఛయా?

పరునిఁ దగ్గరి కూరుచుండుట? కరస్పర్శంబు గావించుటా?
వరునిఁ జూచుట? ధిక్కరించుట? సగర్వ ప్రాభవంబందుటా?
మరియేతోడును లేక దేశములు దిమ్మందిగ్గుటా? నీతి ధ
ర్మరతిఁ బీడుట? యేది స్వేచ్ఛయనగా? మాకుఁ బ్రసాదింపగా.

ఆంగిక వేషభాషల విహారములల్ గుణచేష్టలందు నా
డంగుల కెంత యాదరణ మబ్బినదో మగసంఘమందు? నే
ర్పంగల క్రొత్తపాఠమున వచ్చు వికారపుఁ బౌరుషంబుతో
నంగన లింతకన్న మరియాద గణింతురె యాడిజాతిలో.

పెంపుఁ గోరెడి యార్యసమ్మతముగా విధ్యుక్తధర్మంబను
ష్ఠింపఁ సాంఘిక రాజకీయముల నెట్టే నొక్కయిక్కట్టు ఘ
ట్టింపఁ జాలని సద్వ్యవస్థ ప్రజకుంటే స్వేచ్ఛయా; నెట్టి ప
ట్టింపుఁ లేని విశృంఖలాచరణ పాటిం పెన్నడుఁ గూడునే?

అనిరుద్ధంబగు కామలంపటత కేయడ్డంబులేకుండ, శా
స్త్రనిషేధంబులఁ ద్రెంపి, విచ్చలవిడిఁ జట్టాలు గావించి, రెం
డును మాఁత్రికి నష్టులేదని వితంతు స్త్రీల బెండ్లాడ, భ
ర్తను పోమొత్తుటకుఁ గులాంతరసగోత్ర స్త్రీలఁ జేపట్టఁగఁ.

మమ్మాడి కించుచుఁ బయికి మాన్యులతీరుగ విఱ్ఱవీఁగుచో
ద్యమ్మాడి యాసగా మనసు తత్త్వము బ్రద్దలు సేయు మాదువా
క్యమ్మాఁశి దంపుద్రేటు బలెనై బలు రోసము గ్రక్కువారలా
గుమ్మడికాయ దొంగనిన గూనిబుజంబులు పట్టిచూచెనాఁ.

ఆలుసజీవమైన యొక యంత్రము, సంతతిసాధనంబు, భో
గాలు యథేచ్ఛ నిచ్చు, బలుకష్టము లోర్చుచు నన్నపాను భా
వాలు తమంతఁదామె మగవారికిఁగల్గు దినాలు కొంతకుఁ
మేలు గతించిపోయినవి మీరివియెల్ల నెఱుంగ రేగదా!

చేతఁ వాతను గాని వాని నయినఁ జేపట్టి పోషించి, లో
కాతీత ప్రతిభా ప్రభావముల నానా మేలనఁ జేసి, వి
ఖ్యాతిఁ బ్రాతిగ గూర్చి, దేశమునకే యౌన్నత్యముఁ దెచ్చు మా
పాతివ్రత్యమె వారివజ్రకవచంబా నాటికిఁ నేటికిఁ.

గుణపాఠంబును నేర్పు నుక్కునెనగల్ గుగ్గిళ్లుగా వండియుఁ
వనజాప్తోదయమాపియుఁ, హరిహర బ్రహ్మాదులఁ ఏమినే
రని పొత్తిళ్లనిసుంగులఁ సలిపి, ఆర్యప్రాభవప్రాప్తి కె
త్తినదారా! జయపుంబతాక సతిపాతివ్రత్యమాహాత్మ్యమే.

ఆకాలంబున ధర్మమార్గపరులే ఆబాలగోపాలమున్
నీ కేరీతిగఁ గష్టకారణము కానీ యిట్టి కష్టాలు గా
నీ కల్గున్ ? యిక వచ్చిపోయి పదునాల్గేండ్లే యరణ్యంబులో
నీకుంటల్, పదినెల్లె నిండుచెఱ మాకీజన్మమింతేకదా ?

సకలజగత్పరిభ్రమణ శాసక సత్త్వము నాదిశక్తిగా
ప్రకృతిని గన్నతల్లిగ నపౌరుషశేముషి వేద మాతగా
ప్రకటిత వాక్స్వరూపము సరస్వతిగా గొను నార్యదృష్టి స్త్రీ
లకుఁదగు గౌరవాదరములన్ సృజియించెనో ? కించసేసెనో ?



| పేజి. | పంక్తి. | అచ్చు పొరపాట్లు. | సవరణలు. |
|---|---|---|---|
| 4 | 11 | యినెనోల్ల | యినినోల్ల |
| 5 | 14 | వేల్లేమొ | వ్లేగ్లేమొ |
| 10 | 12 | నిత్సమ్ముక్ | నిత్యమ్ముక్ |
| 10 | 19 | నప్పులే | నప్పిలే |
| 12 | 4 | నీర్నారు | నీగ్గారు |
| 12 | 14 | మమ్మర్ మదిం | మమ్మక్ మది |
| 13 | 6 | పెటి | పెట్టి |
| 13 | 13 | నేన దేల | నేల |
| 14 | 5 | డగ్ | దగ్ |
| 14 | 7 | ఎంతకు | వింతకు |
| 16 | 19 | ప్రభువ్పే | ప్రభువ్లే |
| 17 | 10 | ద్వితీయ | త్వదీయ |
| 17 | 13 | గృహోద్యానము | ద్యానము |
| 17 | 17 | గృత్యములికక్ | మూలకక్ |
| 18 | 9 | వే | లే |
| 18 | 4 | నంగిన | వంగిన |
| 19 | 2 | మంద్రి | మండ్రి |
| 20 | 6 | యేలక | యేలిక |
| 20 | 10 | తేమనిజంగ ప్రమాన | తేమ ప్రమాన |
| 20 | 19 | కంటు | కంటే |

| | | | |
|---|---|---|---|
| 21 | 10 | బెట్టుకొని | బెట్టుకోని |
| 21 | 15 | స్వాతంబందు | స్వాంతంబందు |
| 21 | 19 | లేకుండునేగా | లేకుండుగా |
| 22 | 6 | సుహృద్ధామము | సుహృద్భావము |
| 25 | 7 | కెటయెదుట | కెట్టయెదుట |
| 31 | 1 | గాంచగగౌరిశారదా | గాంచగశారదా |
| 33 | 8 | ఘున | ఘున |
| 34 | 17 | మేలిము | మేలము |
| 36 | 9 | యుత్తము | యత్తము |
| 39 | 8 | పేర్మిల | పేర్నిల |
| 42 | 1 | సున్వన | సున్వన |
| 48 | 2 | మేని | మేసి |
| 52 | 10 | నెమ్మోమ్ముడిక్కఁ | నెహ్మోమ్ముడిక్కఁ |
| 54 | 6 | లాత్ముల | లాత్మల |
| 63 | 15 | ఆమయ | ఆమయా |
| 64 | 1 | రవతయు | గవంతయు |
| 64 | 7 | వెల్ల | లెల్ల |
| 70 | 18 | కెన్నఁ | కన్నెఁ |
| 80 | 15 | మెల్లలకుఁ | మెల్లరకుఁ |
| 80 | 22 | బందుతనఁ | బందునఁ |
| 81 | 5 | సౌఖ్యబందు | సౌఖ్యంబందు |
| 88 | 16 | విద్యలకు | విద్యకు |